# భారతీయ సంస్కృతీ ప్రచార సమితి

'స్వ' ' స్వీయవాదకం ' లేదా ' స్వార్థం''పరహితం' అంటే 'పరసేవ' అనే భావనను ప్రతివ్యక్తిలో మరింత విస్తరింపజేసి, ఆ భావనా పరిధిని కుటుంబం, గ్రామం, దేశం, సృష్టి అంటే పరమాత్ముడివరకూ అభివృద్ధి చేయడానికి అవసరమైన యోగ్యమైన సంస్కారాల ద్వారా వ్యక్తి సుసంస్కారితం చేయాలనే సంకల్పం మన ప్రాచీన ఋషి మునులది. ఈ సంస్కారాల ద్వారా జరిగే వ్యక్తి నిర్మాణమనే కార్యం యుగయుగాలుగా 'సూతల' (సంస్కృతీ ప్రచారకుల) ద్వారా నిత్యమూ అవిశ్రాంతంగా జరుగుతూ వస్తోంది. దాని ఫలితంగానే మొత్తం ప్రపంచంలోనే భారతీయ సమాజం అనాదిగా సుఖశాంతులతో కూడిన జీవనాన్ని గడుపుతూ వస్తోంది. దీనికి వ్యతిరేకంగా వ్యక్తిపరమైన, భౌతిక భోగవాద సంస్కృతికి చెందిన పాశ్చాత్య దేశాల్లోని సమాజజీవనం కేవలం ఏడువందల సంవత్సరాల కాలంలోనే విచ్ఛిన్నదశకు చేరుకుంటోంది. . కుటుంబం విచ్ఛిన్నం, వైవాహిక విచ్ఛిత్తి, తల్లిదండ్రులు లేని సంతానం లాంటి సమస్యల పట్ల అక్కడి సామాజిక కార్యకర్తలు ఆలోచన చేస్తున్నారు.

ఈ విధమైన సాంస్కృతిక సంకట పరిస్థితిలో భారతీయ సమాజ నిరంతర, సుఖవంతమైన దీర్ఘజీవన రహస్యం గురించి, వైయక్తిక వాదంలో మునిగిని నేటి భారత, సమస్త ప్రపంచ ప్రజలకు తెలియజెప్పడమనే బాధ్యత నిష్ఠావంతులైన భారతీయుల భుజస్కంధాలపై ఉంది. మన్నవైన మౌలిక సిద్ధాంతాల గొప్పదనాన్ని, నేటి పరిస్థితుల కనుగుణంగా మార్చుకొని, సరైన పద్ధతిలో వివరించి చెప్పగల ' సూతుల 'సంఘటనను నిర్మాణం చేయాల్సిఉంది.

# భారతదేశం - విశ్వవైభవం





తెలుగు అనువాదం

**శ్యాంప్రకాశ్**



హిందీ మూలం:

**శ్రీరాం సాఠే**

**సుశీలా అభ్యంకర్**

**శకుంతల దవే**

సేవికా ప్రకాశన్ - ఆంధ్రప్రదేశ్

# మనవి

భారతీయ సంస్కృతి ప్రచార సమితి ద్వారా కొన్ని పుస్తకాలు వ్రాయుటకు నిర్ణయం జరిగింది. దానిలో మొదటిగా 'కుటుంబ వ్యవస్థ అవసరమా' అనే పుస్తకము తెలుగులో సంక్రాంతినాడు 14.1.1997న వెలువరించడమైనది. భారతీయ సంస్కృతి ప్రచార సమితి అనుమతి ద్వారా కొన్ని రోజులలోనే మరియొక పుస్తకము ప్రచురించే భాగ్యం లభించినది. 'భారతీయ సంస్కృతి ప్రాచీనము కాదు, శ్రేష్ఠమైనది కాదు' అనే దుష్ప్రచారం ఆంగ్లేయ పరిపాలన సమయంలో జరిగినది. ఆ అబద్ధ ప్రచార దుష్ప్రభావం నేటికీ కనిపిస్తూనే ఉన్నది. ఈ విషయంలో వాస్తవ విషయాన్ని తెలియజేసే ఉద్దేశ్యంతో ఉపయోగమనుకొని ఈ పుస్తకాన్ని ప్రచురించుచున్నాం. ముగ్గురు ప్రముఖ వ్యక్తులు ఈ పుస్తకం సంకలనం చేసారు.

శ్రీ రాంసాఠే గారు ఆంగ్లము, హిందీల్లో వ్రాసిన చాలా పుస్తకాలు ప్రచురించబడ్డాయి. 7, 8 పుస్తకాలు 6,7 ఇతర భాషల్లోకి అనువదించబడ్డాయి కూడా. చాలా మంది విదేశీ రచయితలు, వారి పుస్తకాల్లో పేర్కొన్న విషయాలను తమ రచనల్లో ఉపయోగించుకున్నారు.

శ్రీమతి సుశీలా అభంకర్ గారు వ్రాసిన మరాఠీ పుస్తకం ఆధారంగా వ్రాయబడిన 'వందేమాతరం' అనే పుస్తకం 1994లో మేం ప్రచురించాం. మరాఠీలో వారు వ్రాసిన వ్యాసాలు చాలా ముద్రితమైనాయి. మహారాష్ట్ర ప్రభుత్వం ద్వారా వారు సన్మానించబడ్డారు. రాష్ట్ర సేవికా సమితి అఖిల భారతీయ బౌద్ధిక్ ప్రముఖ్‌గా బాధ్యత నిర్వహిస్తున్నారు.

భారతీయ సంస్కృతి యొక్క మనస్సు చింతన, వ్యక్తీకరణ ఈ మూడు విషయాల్లో శకుంతలాదవే గారు ప్రత్యక్షంగా చెప్పుకోదగిన వారు. భాగ్యనగర్‌లోని ఆయుర్వేద కళాశాలలో వారు సహాచార్యులుగా ఉన్నారు. రా.సే. సమితి భాగ్యనగర్ శాఖకు వారు బౌద్ధిక్ ప్రముఖులు.

దీని తెలుగు అనువాదం శ్రీ శ్యాం ప్రకాశ్ గారు చేసారు. ఈ పుస్తకానికి ముందుమాట వ్రాసిన డా. విజయసారధి గారు తెలుగులో అనేక పుస్తకాలు, వ్యాసాలు వ్రాసారు. వారు ప్రస్తుతం శ్రీ సరస్వతీ విద్యాపీఠం సంఘటనా కార్యదర్శి. విద్యాపీఠం ద్వారా 350 పాఠశాలలు నడుస్తున్నాయి. వారిరువురూ, శ్రీ దామోదర్ శాస్త్రి మరియు అనేక ఇతర పెద్దలు ఈ పుస్తకాన్ని ప్రచురించుటకు సహకరించారు. అందరికి ధన్యవాదములు

ఇట్లు

ప్రకాశకులు

# పాథేయము

''హిందువుగా జన్మించుట ఇలలో మహాభాగ్యమని మరువకురా'' అని ఒకపాట. ఆలోచించిన కొద్దీ ఇందులో దాగియున్న సత్యం బోధపడుతూ ఆశ్చర్యంలో ముంచెత్తుతోంది. ఒక హిందూ కుటుంబంలో జన్మించిన జీవి (ప్రారంభంలో శిశువు - క్రమంగా వ్యక్తి) ఏవిధమైన రుసుము చెల్లించకుండానే తన కుటుంబంలో, తన బంధువర్గంలో, తన గ్రామంలో, తన కులంలో, తన దేశంలో, జాతిలో, మానవాళిలో, పరమేశ్వరుని సృష్టిలో అంతే కాదు పరమేశ్వరుని వ్యక్తీకరించే రూపాలలో - పరమేష్ఠిలోనే ఒక అవిభాజ్యమైన అంగమౌతాడు (సభ్యత్వమనేది చాలా పైపైమాట, అందుకని అది ఉపయోగించటం లేదు) తన కుటుంబ సభ్యుల నుండి అవ్యాజమైన ప్రేమానురాగాలు పొందుతాడు. తన బంధువర్గంలో రకరకాల బాంధవ్యాలు అడగకుండానే ఏర్పడి పోతాయి. తీరు తెన్నూ ఎలా ఉండాలో నిర్దేశించే విద్యావిధానము, సంస్కృతి వాటిని అలవరించేందుకు బడి, గుడి ఉన్నాయి. ఉదర పోషణ నిమిత్తం ఎక్కడికో పోవలసిన అవసరం లేకుండా తన ఇంటిలోనే వృత్తిని అందులో నైపుణ్యాన్ని నేర్పించే కులవృత్తి ఉంది. తన ముంగిట్లోకి వచ్చి వినోదపరిచే వారు కొందరైతే తన గ్రామంలోని అందరినీ సామూహికంగా ఒక చోట చేర్చి వినోద పరిచేవారు కొందరు. వారిచ్చేది వినోదం మాత్రమే కాదు. విపుల ప్రపంచానికి సంబంధించిన విజ్ఞానము కూడా. ఈ ప్రపంచానికి ఈ జన్మకు అతీతమైన జ్ఞానము కూడా ఆ వినోదపు పలుకుల మాటున లభిస్తాయి. అడపాదడపా తీర్థయాత్రలలో వివిధ ప్రదేశాల వారి అనుభవాలతో, వేషభాషలతో, ఆహార విహారాలతో, భాషా సాహిత్యాలతో పరిచయం వీటన్నింటి మధ్య జీవితాన్ని గడుపుతూ వచ్చిన జీవి వయస్సున

కనుగుణమైన సంస్కారాలు పొందుతూ ఒక వ్యక్తిత్వాన్ని సంతరించుకొంటాడు. అదొక విచిత్రమైన స్థానం. తనమీద ఏవిధమైన బంధనాలు లేవు- కుటుంబ సభ్యుల ప్రేమానురాగాలు తప్ప - బంధువర్గపు ఆదరాభిమానాలు తప్ప - కొన్ని వందల సంవత్సరాలుగా ఏర్పడియున్న కట్టుబాట్లు సంప్రదాయాలు తప్ప. తన జీవిత భాగస్వామిగా ఎవరిని చేపట్టదలచినా, బ్రతుకుతెరువుకొరకు ఏ దారి తొక్కినా, మనస్సు సేద తీరటం కొరకు తన వైయక్తిక ప్రయోజనం కొరకు తానేమి చేయదలచుకొనినా ఆలోచించుకొని చేయి అని హెచ్చరించడమే గాని ఆపలేరెవ్వరూ. కాని తాను ఏమి చేయబూనినా కుటుంబ గౌరవాన్ని, వంశ ప్రతిష్ఠని, గ్రామపు కట్టుబాట్లని, కులాచారాలను, సంప్రదాయాలను, మానవ ధర్మాన్ని పరిగణనలోకి తీసికొనకుండా ఏమీ చేయలేడు. స్వేచ్ఛ ఉందా అంటే లేదు; లేదా అంటే ఉంది. పైన చెప్పిన వాటికి హాని కలుగనంత వరకు కావలసినంత స్వేచ్ఛ ఉంది.

కుటుంబ వ్యవస్థ, పంచాయతీ వ్యవస్థ గురుకుల వ్యవస్థ కుల వృత్తుల వ్యవస్థ, బొమ్మలాటలు, భాగవతులు మొదలైన వాటితో ఏర్పడిన ధర్మప్రచార వ్యవస్థ మొదలైన ఎన్నో వ్యవస్థలను చక్కగా రూపొందించుకొన్నది హిందూ సమాజం. ఈ వ్యవస్థల ప్రయోజనం పొందటమన్నది శ్రద్ధాభక్తులతో ముడిపడియుందేగాని సభ్యత్వ రుసుముతో ముడిపెట్టుకొని లేదు. ఇది ఆర్థిక శాస్త్రవేత్తల కొలమానాలకు అందేది కాదు.

హిందువుల వ్యవస్థలన్నీ సత్యకాలపు వ్యవస్థలు. ఇవన్నీ శాంతి భద్రతల సమస్యలు లేకుండా ప్రశాంతంగా ఉన్నప్పుడు నడువవచ్చు. కాని నిత్య నిరంతర సంఘర్షణ ఉన్న సమయంలో నిలబడతాయా అన్న ప్రశ్న ఈనాటి హిందువులను కలత పెడుతోంది.

చరిత్ర కారులు అంగీకరిస్తున్న భారతీయుల చరిత్ర కాలం దాదాపుగా ఏడు వేల సంవత్సరాలు. ఈ ఏడు వేల సంవత్సరాలలో గ్రీకులు, శకులు, కుషాణులు, హూణులు, అరబ్బులు, తురుష్కులు, మొగలాయిలు మొదలుగా గల వివిధ జాతుల వారు మనపై దండెత్తి వచ్చారు. మనలను సర్వనాశనం చేయడానికి బలప్రయోగం చేశారు. లక్షల మందిని హతమార్చారు. అయినా రాజ్య వ్యవస్థను కొంత వరకే మార్చగలిగారు. కొందరిని బలవంతంగా మతం మార్చారు. అయినా కొన్ని కొన్ని ప్రాంతాలలో మాత్రమే సామాజిక, సాంస్కృతిక వ్యవస్థలను కొంత మేరకు మార్చగలిగారు. హిందూ సమాజంపైన పేర్కొనిన వ్యవస్థలు బలంగా ఉన్న ప్రాంతాలలో నిలద్రొక్కుకొని విదేశీ ప్రభావాన్ని త్రిప్పి కొట్టింది. ఢిల్లీ, హైదరాబాద్, బెంగాల్ ప్రాంతాలు తప్ప మిగిలినవన్నీ స్వరాజ్య స్వతంత్ర పాలనలోకి వచ్చాయి. హిందూ జీవన విధానం భంగపడకుండా రక్షించుకొన్నది.

ఆ తరువాత వ్యాపారానికని వచ్చి స్థావరాలు ఏర్పరచుకొన్న పోర్చుగీసు, ఫ్రెంచి, డచ్చి, ఆంగ్లేయులలో - ఆంగ్లేయులది పైచేయి అయింది. ఊహకు అందని రీతిలో ఆంగ్లేయులు ఈ దేశపు రక్షణ వ్యవస్థను వశపరచుకొన్నారు. ఆ బలంతో పన్ను వసూలు చేసే అధికారం చేపట్టారు. క్రమక్రమంగా విద్యావ్యవస్థలోను, న్యాయ వ్యవస్థలోను, పరిశ్రమలలోను అన్ని జీవనరంగాలలోను మౌలికమైన మార్పులు ప్రవేశ పెట్టి వేల సంవత్సరాల హిందూ జీవన విధానాన్ని విచ్ఛిన్నం చేసే ప్రయత్నం చేశారు.

ఇంత జరిగినా హిందూ కుటుంబ వ్యవస్థ, గ్రామ పంచాయతీ వ్యవస్థ బలంగానే ఉన్న కారణంగా జాతి పూర్తిగా అతలాకుతలమైపోలేదు. వివేకానందుడు, దయానందుడు, అరవిందుడు, లాల్, బాల్, పాల్, మహాత్మా గాంధి, నేతాజీ సుభాష్‌చంద్రబోసు, డాక్టర్ హెడ్గేవార్,

టంగుటూరి ప్రకాశం, సర్దార్ పటేల్ వంటి నిస్వార్థ ప్రజాసేవకులు రంగంలోకి రావడానికి, వేలాది కుటుంబాలు వారి పిలుపునందుకొని స్వాతంత్ర్య సాధనకై ఉద్యమించడానికి అనువైన వాతావరణం నాటికి ఉంది. ఆంగ్లేయుల నిష్క్రమణతో దేశం తిరిగి స్వాధీనమైంది. అదే సమయంలో దేశ విభజన కూడా జరిగింది.

వందల వేల సంవత్సరాలుగా తమ కుటుంబానికి ఆలంబనగా ఉన్న ఇళ్లు, పొలాలు, తోటలు, వ్యాపారాలు వదిలివేసి దాదాపుగా కట్టుబట్టలతో కుటుంబ సభ్యులంతా కలిసి భద్రమైన హిందూ దేశ ప్రదేశాన్ని వెదుక్కొంటూ వచ్చిన కుటుంబాలు లక్షల సంఖ్యలో ఉన్నవి. పాకిస్థాన్, బంగ్లాదేశ్‌ల నుండి మాత్రమే కాదు; అసురక్షితంగా ఉన్న కాశ్మీర్ నుండే వేల కుటుంబాలు నిరాశ్రయులై - ఏదో రక్షించుకోవాలని తమ భాగ్యాన్ని వెదుక్కొంటూ వస్తున్నారు. ఏమి రక్షించుకోవడానికి? ధనమా? ఆస్తులా? వృత్తి వ్యాపారాలా?

కుటుంబ వాతావరణాన్ని రక్షించుకోగలిగితేనే వీర శివాజీలు విజృంభించగలిగేది. కుటుంబ జీవనానికి అనుగుణమైన గ్రామ వాతావరణాన్ని రక్షించుకొంటేనే తరతరాల వారసత్వాన్ని నిలుపుకోగలిగేది. గ్రామాల అస్తిత్వాన్ని, స్వాతంత్ర్యాన్ని కాపాడుకోగలిగితేనే స్వావలంబులమై దేశ స్వాతంత్ర్యాన్ని పదిలపరచుకోగలిగేది. దేశ స్వాతంత్ర్యాన్ని పదిలపరచుకోవటమే కాదు; పరిపుష్టం చేసికొన్నప్పుడే మన జీవితం సార్థకమయ్యేది.

ప్రపంచపటంలో ఒకనాడు మహోన్నతంగా విలసిల్లిన ఈజిప్టు, సుమేరియా, అస్సీరియా, బాబిలోనియా, గ్రీకు, రోమన్ నాగరికతలు ఈనాడు కనరావటం లేదు. రవి అస్తమించని సామ్రాజ్యాన్ని ఏలుతున్నామని

ప్రగల్భాలు పలికిన ఆంగ్లేయుల వైభవము, ప్రపంచపు భవిష్య రాజధాని మాస్కో అని డంబాలు పలికిన సోవియట్ కమ్యూనిజము మిణుగురు పురుగుల మెరుపులు మాత్రమేనని చరిత్ర నిర్ధారించింది.

స్వామి వివేకానందుడు నుడివినట్లుగా ఒకవైపున దురాక్రమణ స్వభావము ఇసుమంత కూడా లేకుండా కత్తి పట్టుకొని విదేశీ భూములలో కవాతు చేయకుండా జీవిస్తూ, మరోవైపున శతాబ్దముల అఘాతములను, వందలాది దండయాత్రలను తట్టుకొని నిలచి జీవిస్తున్న జాతి మనది. మన సమాజ జీవితంలోని అంతర్నిహితమైన శ్రేష్ఠతయే అందుకు కారణం. మన జాతి యొక్క ప్రాచీనత, శ్రేష్ఠత మనకు గర్వకారణాలు మాత్రమే కాదు; అంతటి గర్వకారణమైన, ప్రాచీనమైన, శ్రేష్ఠమైన జాతీయతను పదిలపరచుకొని పరిపుష్టం చేసికొనడం మన కర్తవ్యం. దాని కొరకై ఎంతటి త్యాగానికైనా వెనుదీయరాదు. ఎంతటి శ్రమకైనా ఓర్చుకోవలసిందే అని హెచ్చరిస్తున్నదీ పుస్తకం. గ్రంథకర్త, అనువాదకులు, ప్రకాశకులు అందరూ వందనీయులు; అభినందనీయులు. మీద పడుతున్న వార్ధక్యాన్ని చిరునవ్వుతో తృణీకరిస్తూ వారు చేసిన, చేస్తున్న కృషిని చూస్తున్నప్పుడు అజరామరమీ భారతమని మనకున్న విశ్వాసం బహుధా బలపడుతోంది.

**-వడ్డి విజయ సారథి**
సంఘటనా కార్యదర్శి
శ్రీ సరస్వతీ విద్యాపీఠం

ఇతర దేశాల సంస్కృతి, జాతీయతల కంటె భారతదేశ సంస్కృతి అతి ప్రాచీనం, అత్యంత శ్రేష్ఠం. ఈనాడున్న దేశాలలో జాతీయ జీవనం నిరంతరంగా సాగుతూనే ఉంది. వాటితో పోల్చి చూస్తే భారతదేశం వాటి అన్నింటికంటె ఎంతో సుదీర్ఘ జీవనం, శ్రేష్ఠత్వం కలిగి ఉంది. ప్రస్తుతం భారతదేశ ప్రాచీనత గురించి దాని శ్రేష్ఠత గురించి పరిశీలిద్దాం.

# ప్రాచీనత

## ఐక్యరాజ్య సమితి:

ప్రపంచంలో ఈనాడున్న దేశాలలో చాలా దేశాలు ఐ.రా.స.లో సభ్యదేశాలుగా ఉన్నాయి. అవి రమారమి 180 దాకా ఉన్నాయి. ఇంతవరకు జరిగిన రెండు ప్రపంచ యుద్ధాలు ఐరోపా దేశాల మధ్యనే జరిగాయి. క్రీ.శ. 16వ శతాబ్దం నుండి ప్రపంచమంతా తమతమ సామ్రాజ్యాలను స్థాపించాలనే ప్రయత్నంలో ఈ దేశాలు మునిగి ఉన్నాయి. భౌతిక ఐశ్వర్యం కోసం ఈ దేశాల మధ్య పోటీ ఏర్పడింది. తత్ఫలితంగా వారి మధ్య రక్తపాతం జరిగింది. మొదటి ప్రపంచ యుద్ధంలో జరిగిన వినాశనాన్ని వారు గమనించారు. ఈ లాగున రక్త పాతాలు జరగటం కంటె ప్రపంచ దేశాలన్ని పరస్పర ఆలోచనల ద్వారా తమతమ సమస్యల్ని పరిష్కరించుకుంటే శ్రేయస్కరం అని వాళ్లు గమనించారు. 1920లో ''లీగ్ ఆఫ్ నేషన్సు'' (నానా రాజ్య సమితి) ని స్థాపించారు. ఆ సమయంలో ''ఇది ప్రభుత్వాల సంస్థే కాని జాతుల సంస్థ కాదు'' అని అరవింద మహర్షి పేర్కొన్నారు. అతి ప్రాచీన కాలం నుండి మానవ శ్రేయస్సును నిరంతరం కోరుతూ దానిని పొందటం కోసం నిత్యం శ్రమిస్తూ ఉండే భారతీయ మేధావులు, ఋషులు ప్రభుత్వానికి జాతికి మధ్య గల భేదాన్ని స్పష్టంగా గ్రహించారు. వారు ఆ భేదాన్ని భారతీయులందరికీ తెలియజేస్తూ వచ్చారు. ఆ కారణంగా అరవింద మహర్షి చెప్పిన విషయాన్ని భారతీయులు అతి సులభంగా గ్రహించగలిగారు. కాని

ప్రభుత్వ కారణంగా జాతులుగా ఈ మధ్య కాలంలో ఏర్పడిన వారు ఐరోపావారు. వారికి అరవింద మహర్షి చెప్పిన విషయం గ్రహించడం అంత సులభం కాదు.

నానా రాజ్య సమితిని ఐరోపా వాసులు తమ స్వార్థం కోసం ఉపయోగించుకున్నారు. అందువల్ల రెండవ ప్రపంచ యుద్ధం జరిగింది. దీనితో నానా రాజ్య సమితి వల్ల ప్రయోజనం లేదని భావించి రెండవ ప్రపంచ యుద్ధం తరువాత 1945లో ఐక్యరాజ్య సమితిని స్థాపించారు. దీనినే యు.యన్.ఒ. అంటారు. జాతికి ప్రభుత్వానికి మధ్య గల భేదాన్ని ఐరోపా వాసులు అర్థం చేసుకోవడం కష్టం అని మరోసారి ఋజువైంది.

ఐ.రా.స. రాజ్యాంగాన్ని ఐరోపావారు తయారు చేశారు. ఇందులో అన్ని ప్రపంచ రాజ్యాలు, ప్రభుత్వాలు సభ్యులు కావచ్చు అన్నారు. కొత్తగా ఏర్పడిన ప్రభుత్వాలు సైతం ఈ సమితిలో సభ్యత్వం పొంది క్రొత్త జాతులుగా రూపొందుతున్నాయి.

1991కి ముందు ఐ.రా.సలో రష్యా ఒక సభ్య దేశం. 1991లో అది చిన్నాభిన్నమై 12 రాజ్యాలుగా మారిపోయింది. 12 రాజ్యాలు ఐ.రా.స.లో సభ్యులై ప్రత్యేక జాతులుగా రూపొందాయి. కాబట్టి ఆ కొత్త జాతుల గురించి మనం ప్రత్యేకంగా ఆలోచించాలి. వాటిలో చాలా రాజ్యాల మీద ఐరోపీయ ప్రభావం ఉంది. అందుచేత ఈ ఐరోపా దేశాల గురించి ముందుగా ఆలోచిద్దాం.

## 18వ శతాబ్దంలో జాతీయత ప్రారంభం

ఫ్రాన్స్‌లో విప్లవం జరిగిన తరువాతే ప్రప్రథమంగా జాతీయత ప్రారంభం అయిందని ఐరోపా విద్వాంసులు సెలవిచ్చారు. ''పెన్గ్విన్ డిక్షనరీ ఆఫ్ సోషియాలజీ''లో జాతీయతను గురించి ఇలా వర్ణించారు. క్రీ.శ. 18 శతాబ్దానికి ముందు ప్రపంచంలో ఏమూల కూడా జాతీయ భావన ఉండేది కాదు. క్రీ.శ. 19వ శతాబ్దంలోనే నెపోలియన్ కాలంలో ఐరోపా దేశాలలో

ప్రప్రథమంగా అక్కడక్కడ కొన్ని రాజ్యాలు ఏర్పడ్డాయి. వాటి ద్వారా ఆయా దేశ ప్రజలు జాతులుగా ఏర్పడ్డారు. ఆ తర్వాత ప్రపంచంలోని ఇతర దేశాలలో ప్రజలు ఒక్కొక్క ప్రత్యేక జాతిగా ఏర్పడ్డారు. క్రీ.శ 1871లో ఐరోపాలో జర్మనీ ఒక జాతిగా ఏర్పడింది. తరువాత జర్మనీలో ఇటలీలో జాతీయ భావం బలపడింది. ఐరోపా విస్తరణ వాదంతో పాటు ఈ భావం మిగతా ప్రపంచంలో వ్యాపించింది.

క్రీ.శ. 5వ శతాబ్దం నుండి 15వ శతాబ్దం వరకు గల కాలఖండాన్ని ఐరోపాలో ''అంధకార యుగం'' అంటారు. దీనికి ముందు ఐరోపా ఖండంలో క్రీ.పూ. 1450 నుండి క్రీ.శ. ప్రారంభం వరకు గ్రీకు నాగరికత విలసిల్లింది. అలాగే క్రీ.పూ. 850 నుండి క్రీ.శ 450 వరకు రోము నాగరికత నెలకొంది. ప్రస్తుత ఐరోపా వాసులు ఈ రెండు నాగరికతల గురించి ఎంతో గర్వంగా చెప్పుకొంటారు. లిపి మొ. కొన్ని విషయాలను వారి నుండి వీరు గ్రహించారు. కాని నేటి ఐరోపా జాతులు తమంత తాముగా అంధకార యుగం తరువాత ఆవిర్భవించాయి.

ఈ యుగానికి ముందు ఐరోపాలో ఎక్కువ భాగం రోము సామ్రాజ్యంలో ఉండేది. రోము సామ్రాజ్యపు చివరి దశలో రోమనులు ఇంగ్లండును విడిచి వెళ్తామన్నారు. అప్పుడు ఇంగ్లీషు వారు రోమనులను ఇంగ్లండులోనే ఉండిపొమ్మని ప్రార్థించసాగారు. రోమనులు ఇంగ్లండునుండి వెళ్ళిపోతే తమకు రక్షకులెవ్వరూ ఉండరని ఇంగ్లండు వారు అట్లా కోరారు. క్రీ.పూ. 5వ శతాబ్దంలో ఐరోపా వాసులందరి పరిస్థితి ఇలాగే ఉంది. సామాజిక భావన లేక జాతీయ భావన కలికానికి కూడా కనిపించటం లేదు.

## ఐరోపాలో జాతీయత ఆవిర్భావం

ఐరోపాలో జాతీయత ఎప్పుడు ఏర్పడింది. అనే విషయంలో భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. ఫ్రాన్స్ రక్తపాత విప్లవం తరువాతనే జాతీయత బలపడిందని సామాన్యంగా అంటారు. క్రీ.శ. 16వ శతాబ్ది ప్రారంభంలో

ఫ్రాన్స్, ఇంగ్లాండు, స్పెయిను దేశాలలో జాతీయ భావం నెలకొన్నదని కొందరి అభిప్రాయం. క్రీ.శ. 1214లో ''బోవిన్సు'' యుద్ధంలో ఫ్రాన్స్ రాజు ఫిలిప్స్ ఇంగ్లండు, జర్మనీ, ఫ్లాండర్సు సంయుక్త సైన్యాలను ఓడించారు. అప్పటి నుండే ఫ్రాన్స్‌లో జాతీయ భావం ప్రారంభమైంది. బోవిన్సు యుద్ధం జరిగిన వంద సంవత్సరాల తరువాత ''బానాక్ బర్న్'' యుద్ధరంగంలో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా లభించిన విజయంతో స్కాట్‌లాండ్‌లో జాతీయత ప్రారంభమైంది. క్రీ.శ. 1412లో ''మూర్'' జాతి ప్రజలను ఓడించి గ్రెనెడాను ఆక్రమించిన తరువాత స్పెయిన్‌లో జాతీయ భావం మొదలైంది. 16వ శతాబ్దం ఉత్తరార్థంలో స్పెయిన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిగిన తిరుగుబాటుతో పాటు హాలెండులో డచ్ జాతీయత నిర్మాణమైంది.

జర్మనీ, ఇటలీలలో ఈ ప్రక్రియ 19వ శతాబ్దంలో పూర్తయింది. వాస్తవానికి రాజనీతి విశారదుడైన ''నికోలో మాకియవెల్లి'' (1469-1523) ఇటలీ ఏకత్రీకరణ ఆలోచనను చాలా కాలం ముందే ప్రస్తావించాడు. 17వ శతాబ్దపు స్వాతంత్ర్య యుద్ధం మొదలైన కారణంగా అమెరికా వలస రాజ్యాలలో జాతీయతా బీజారోపణ జరిగింది.

ఐరోపావాసుల జాతీయ భావం తొమ్మిది, పది శతాబ్దాలలో ప్రారంభమైందని కొందరు చరిత్రకారుల అభిప్రాయం. కింగ్ ఎగ్‌బర్ట్ (802-839) ప్రారంభించిన ఇంగ్లండు ఏకీకరణ ప్రక్రియ కింగ్ ఆల్‌ఫ్రెడ్ (871-901) కాలం వరకు కొనసాగుతూ వచ్చింది. హ్యూజ్ కాపెట్ (987-996) నాయకత్వంలో జర్మనీలోను, హెన్రీది-ఫౌలర్ (918-936) నాయకత్వంలో ఫ్రాన్స్‌లోను ఈ ప్రవాహం కొనసాగింది. అలెగ్జాండర్ వారసుల 550 సంవత్సరాల రాజ్యపాలన తరువాత ప్రపంచంలో ప్రప్రథమంగా ఫిలిస్తీన్‌లో యూదుప్రజల జాతీయత మొదలైందని కొందరు పండితుల వాదన. ఐరోపా వాసుల జాతీయత ఆవిర్భావం, దాని స్థిరీకరణలలో రాజుల పాత్ర ప్రభుత్వాల పాత్ర చాలా ఉంది. ఇంగ్లండు రాణి ఎలిజబెత్, క్రాంవెల్, జర్మనీకి చెందిన ఫ్రెడరిక్-ది-గ్రేట్, బిస్మార్క్‌లు, ఫ్రాన్స్‌కు చెందిన 14వ

లూయి, నెపోలియనులు, రష్యాకు చెందిన పీటర్-ది-గ్రేట్, ఆస్ట్రేలియాకు చెందిన రెండవ జోసఫ్, ఇటలీ దేశీయుడైన విక్టరీ ఇమాన్యుల్, కానూర్‌లు ఈ కోవకు చెందిన వారే. ఈనాడు ఐరోపాలో ప్రజాస్వామ్య పటాటోపం ఉన్నా జాతీయతకు రాచరికమే ఆధారం. ఏది ఎట్లున్నా ఫ్రాన్స్ విప్లవం తరువాతనే ఐరోపాలో జాతీయ భావన బలపడసాగింది.

అంధకార యుగం నుండి అనగా ఆటవిక దశ నుండి జాతీయతను పొందే వరకు వారు చేసిన ప్రయాణంలో ఐరోపాలో ఒక్కొక్క రాజ్యానికి ఒక్కొక్క జాతి ఏర్పడింది. ఐరోపాలోని అన్ని జాతుల వికాసం ప్రభుత్వాలే రాజ్యాలుగా బలపడిన తర్వాతనే జరిగినందువల్ల ఏ దేశం జాతీయత ఐనా ప్రభుత్వం ఏర్పాటు తరువాతనే జరుగుతుందనే అభిప్రాయం వారిలో దృఢపడింది. తమ ఈ అభిప్రాయాన్ని ప్రపంచమందరి నెత్తినా వారు సులభంగా రుద్దగలిగారు. చైనా, ఇజ్రాయిల్, జపాన్ వంటి ఆసియా దేశాలను మినహాయిస్తే ఆసియాలోని ఇతర దేశాలలోను, అమెరికా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా ఖండాలలోని దేశాలలోను అప్పటికి జాతీయత నిర్మాణమైన దేశాలు చాలా తక్కువ. ఇందువల్ల ఐరోపాతో పాటు ఐదు ఖండాలలోను ''ప్రభుత్వాలేర్పడిన తర్వాతనే జాతి నిర్మాణం అవుతుందనే ఐరోపా వాసుల ఆలోచనను ప్రచారం చేయటం చాలా సులభం అయింది.

## ఐరోపీయ విస్తరణ తరువాత ఏర్పడ్డ జాతులు

మధ్య యుగం నాటి ఐరోపాకు జాతీయతా కల్పన ఏమాత్రమూ లేదు. క్రీ.శ 15వ శతాబ్దంలో మధ్యయుగం నుండి ఆధునిక యుగంలోనికి ఐరోపా అడుగుపెట్టింది. దీనిని ''రినైజాన్సు'' అంటారు. రినైజాన్సు లేక పునరుజ్జీవనం అంటే కళలు, శాస్త్రాలు, విద్య మొదలగు వాటి పునర్జన్మయే. గ్రీకు, రోమనుల కాలంలో ఐరోపా వాసులకు ఈ విద్యలలో ఉన్న జ్ఞానానికి పునర్జన్మ, అభివృద్ధి కలిగాయని దీని అర్థం. క్రీ.శ. 5వ శతాబ్ది నుండి

దిగజారిన క్రైస్తవమతాధిపతులు ఐరోపా మీద జరుపుతూ వచ్చిన అత్యాచారాలనుండి ఈ సమయంలోనే అనగా క్రీ.శ. 15వ శతాబ్దంలోనే వారికి విముక్తి కలగటం మొదలైంది.

ఈ అత్యాచారాల కారణంగా అనేక మంది ఐరోపా ఐహిక వాదులు సెక్యులరిస్టులుగా భౌతిక వాదులుగా మారిపోయారు. భౌతిక సుఖ భోగాలను అనుభవించాలనే వారి కోరిక తీవ్రమై ఐహిక సిరి సంపదలను వెతుక్కొంటూ వారు ప్రపంచమంతా తిరగసాగారు. ఐరోపీయ విస్తరణ క్రీ.శ. 1500 నుండి నాలుగు వందల సంవత్సరాల వరకు కొనసాగింది. ఆయా దేశాలలో ఉండే సాధనాల ఉపయోగం, మార్కెటు వ్యవస్థ, విజయం ద్వారా లభించిన అధికారం, ప్రభుత్వాధికారం, మతం మార్పిడులు వీటన్నిటి ద్వారా ఐరోపావాసులు అనేక చోట్ల అధికారం స్థాపించి, తమ పాశ్చాత్య నాగరికతను స్థానిక ప్రజలపై రుద్దసాగారు. స్థానిక ఉన్నత వర్గాలలో తమ నాగరికతను వ్యాపింపజేయటంలో వారు గొప్ప విజయం సాధించారు.

ఐరోపా వాసులు తమ సామ్రాజ్య విస్తరణ కృషిలో జనసంఖ్య తక్కువ ఉన్న అమెరికా, ఆస్ట్రేలియా వంటి దేశాలలోని స్థానిక ప్రజలను అసంఖ్యాకంగా ఊచకోత కోశారు. తమ స్వార్థ ప్రయోజనాల కోసం ఐరోపీయులకు మిగిలిన స్థానిక ప్రజల అవసరం చాలా ఉండి వారిని తమలో కలుపుకోవడానికి వారిని క్రైస్తవ మతంలోనికి మార్చటం జరిగింది. అంతేగాక వేష-భాషలలో, అలంకారంలో నడవడి మొదలగు అన్ని విషయాలను వారిచేత అనుకరింపజేశారు. తమ సంఖ్యాబలం ఆధారంగా ఈ దేశాలలో స్థిర నివాసం ఏర్పాటుకు అవకాశం లభించగానే ఐరోపావాసులు ఇలాంటి దేశాలలో ''ఒకే ప్రభుత్వం - ఒకే జాతి'' అనే ఐరోపీయ సిద్ధాంతం స్థిరపడింది. నేటి ఐక్యరాజ్య సమితిలో సభ్యదేశాలైన కెనడా, అమెరికా సంయుక్త రాష్ట్రాలు, రెండు, మూడు వందల సంవత్సరాలలోనే ప్రత్యేక జాతులుగా ఏర్పడ్డాయి.

## ఇస్లాం మత రాజ్యాలు:

ఐరోపా, ఆఫ్రికా, ఆసియా ఖండాలకు చెందిన ఇస్లాం దేశాల గురించి ప్రస్తుతం పరిశీలిద్దాం. ఆసియాలో ఏడవ శతాబ్దంలో ఇస్లాం మతం పుట్టి మానవ జాతికి ఒక ప్రత్యేక అనుభవం కలిగించింది. ఆ మతం ప్రకారం ప్రపంచ ప్రజలందరూ రెండే విభాగాలు, అవి దార్ ఉల్ ఇస్లాం (ఇస్లాం మతాన్ని అంగీకరించే వారు) దార్ ఉల్ హరబ్ (దాన్ని అంగీకరించని వారు) ఇస్లాం మతం ఆవిర్భవించిన దశలో ఒకే ముస్లిం రాజ్యం ఉండాలనే ఆశయంతో మొత్తం ప్రపంచాన్ని దార్-ఉల్-ఇస్లాం చేయాలని మహమ్మదీయులు ప్రయత్నించారు. కాని అది సఫలం కాలేదు. క్రీ.శ. 1258లో బాగ్దాద్‌లో సున్నీ రాజ్యం ఏర్పడిన తరువాత 16వ శతాబ్దంలో ఇరాన్‌లో షియా సంప్రదాయాన్ని తమ జాతీయ సంప్రదాయంగా గ్రహించిన తరువాత ఒకే ముస్లిం రాజ్య ఆశయం భగ్నమైపోయింది. అదే గనుక సఫలమై ఉంటే మొత్తం ప్రపంచం ఒకటే ముస్లిం రాజ్యంగా ఏర్పడి రాజ్యమే రాష్ట్రం అనే అభిప్రాయానుసారం మొత్తం ప్రపంచం ఒకే రాష్ట్రమై ఐక్యరాజ్య సమితి అవసరమే లేకపోయేది. ఈనాడు సాధారణ ముస్లిం మనస్సు మీద ఒకవైపు ఏక కేంద్ర విశ్వవ్యాప్త ఇస్లాం రాజ్య నిర్మాణ సంకల్ప ప్రభావం ఉండగా మరొకవైపు పాశ్చాత్య పద్ధతిని అనుసరించిన ''ఒక రాజ్యానికి ఒకే జాతి అనివార్యం'' అనే స్పృహ కూడా ఉంది. మౌలిక ముస్లిం చట్టాల పవిత్రను అతడు ఒప్పుకొంటూనే చట్టాలను ఆధునీకరించడం తప్పనిసరి అని కూడా అతను విశ్వసిస్తాడు. ఈనాడు ముస్లిముల మనస్సు ఏదో ఒక నిర్ణయానికి రాలేక ఊగిసలాడుతూ ఉంది. ఇలాటి సందిగ్ధ మనస్స్థితి కారణంగా ఒకవైపు ఏక ఇస్లాం రాజ్య స్థాపన ఆందోళనలో ఉండగా మరొక వైపు పరస్పరం యుద్ధాలు చేసుకొని ఒకరినొకరు సంపూర్ణంగా నాశనం చేయాలని ప్రయత్నం చేస్తున్న రాజ్యాలు కూడా ఉన్నాయి.

అయితే క్రైస్తవుల పరిస్థితి వేరుగా ఉంది. తమ అనుచరుల సంపూర్ణ

నిష్ఠ, కార్యకర్తల మీద పరమాధికారం పొందాలనే క్రైస్తవ పదాధికారుల ప్రయత్నం 5వ శతాబ్దం నుండి 15వ శతాబ్దం వరకు చాలావరకు సఫలమైంది. కాని రినైజాన్స్ తరువాత ఆ సమయంలో నూతన జాగృతి కారణంగా ఒకవైపు క్రైస్తవ మత ఏకాధికారం సమాప్తమైపోతుండగా మరొకవైపు ఐరోపాలోని విభిన్న సమాజాల విభిన్న సభ్యతా సంస్కృతుల ఆధారంగా వేరువేరు ప్రాంతాలలో రాజ్యాల వారీగా జాతులు, రాజ్యాలు, రాష్ట్రాలు ఏర్పడ్డాయి.

ఇస్లాం ప్రపంచంలో రినైజాన్సు లాంటి ప్రక్రియ ఏదీ జరగలేదు. అందువల్ల క్రైస్తవ శక్తి క్రమంగా క్షీణిస్తూ వచ్చినట్లు ముస్లిం మత నాయకుల అధికారం క్షీణించలేదు. కాని మొదటి ప్రపంచ యుద్ధం తరువాత ఐరోపా వాసుల సంపర్కం కారణంగా ఇస్లాం దేశాలలో రాజ్యాలవారీగా జాతీ వాద తరంగం ఉవ్వెత్తుగా లేచింది. క్రీ.శ. 1920 తరువాత ఇరాన్, ఈజిప్టు, అరేబియా, టర్కీ, మలేషియా మొదలగు జాతులు రూపొందాయి.

ఈ విధంగా ఆలోచిస్తే ఐరోపా, ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలియా, ఆసియా ఖండాలలో నెలకొన్న ముస్లిం దేశాల కాల ఖండం ఐరోపా రాజ్యాల కాల ఖండానికంటే అధిక దీర్ఘకాలం గలవికాదు అని స్పష్టం అవుతుంది.

సాంస్కృతిక జాతీయ జీవనం ఐరోపా దేశాలకంటే చాలా ముందే ప్రారంభమై ఈనాటికీ కొనసాగుతూ ఉన్న దేశాల విషయం ప్రస్తుతం పరిశీలిద్దాం. అట్లాంటి దేశాలు నాలుగున్నాయి. అవి చైనా, జపాన్, ఇజ్రాయిల్, భారతదేశం. ఈ నాలుగూ ఆసియా ఖండంలోనివే కావడం విశేషం.

## జపాన్

ఐరోపాలో సామాజిక భావన లేని కాలంలో జపాన్‌లో షింటో మతం రూపంలో అక్కడి సామాజిక భావన ప్రకటించింది. క్రీ.శ. 3వ శతాబ్దంలో కొరియా కుండా చైనాకు చెందిన కన్ ఫ్యూషియన్ మతం జపానును చేరింది.

7వ శతాబ్దంలో చైనా నుండి బౌద్ధ మతం జపానులో ప్రవేశించింది. ఈ మూడు మతాలు ఎప్పుడు తమ మత భావాలను ఇతరుల మీద బలవంతంగా రుద్దడానికి ప్రయత్నం చేయలేదు. తన సిద్ధాంతమే సరియైనదని, ఇతరులది తప్పని ఏ మతం వారు భావించలేదు. అందువల్ల ఈ మూడు మతాలు శాంతియుత సహజీవనం సాగించాయి. క్రీ.శ. 17వ శతాబ్దం ప్రారంభంలో ఐరోపా వాసులు జపానులో ప్రవేశించారు. మతం మార్పిడి చేసే వాళ్ల దుష్ప్రయత్నం జపానీయులకు పూర్తిగా కొత్త అనుభవమే.

జపాను భూభాగం మీద ఐరోపా వాసులు జరుపుకొంటున్న పరస్పర సంఘర్షణల పర్యవసానంగా జపాన్ ప్రభుత్వం క్రైస్తవ మత ప్రచారాన్ని నిషేధించింది. దాంతో పాటే క్రీ.శ. 1637లో ఐరోపీయులతో వ్యాపారాన్ని సహితం నిషేధించి రాజ్యాంగ బద్ధంగా పాశ్చాత్య దేశాల సంబంధాలను తెగతెంపులు చేసుకొంది. క్రీ.శ. 1818లో ''మేయిజీ'' చక్రవర్తి పరిపాలనా కాలంలో జపానులో జాతీయ భావం బాగా బలపడింది. క్రీ.శ. 1894-95లో చైనాను, 1904-5లో రష్యాను జపాను ఓడించింది. 20వ శతాబ్ది ప్రారంభంలో రష్యాను ఓడించగలిగిన జపాను ఇదే శతాబ్ది అంతంలో ఆర్థిక రంగంలో అమెరికాను సైతం తలదన్నుతున్నది. ఈనాటి జపాను సమగ్రాభివృద్ధికి ప్రముఖ ప్రేరణ శక్తి దాని పరంపరాగత ఉజ్వల జాతీయ భావనయేనని అందరు అంగీకరిస్తారు.

## ఇజ్రాయిల్

ఇజ్రాయిల్ ప్రజలైన యూదుల 4000 సంవత్సరాల జాతీయ జీవనంలో తమ మాతృభూమి ఇజ్రాయిల్ నుండి మూడు పర్యాయాలు తరిమివేయబడ్డారు. మొదటి సారి 200 సం., రెండవ మారు 50 సం. మూడవ తడవ 1850 సం. వరకు వారు మాతృభూమికి దూరంగా ఉన్నారు.

ఈజిప్టుకు చెందిన ''ఫరోహ'' వంశపు రాజు క్రీ.పూ. 1580లు నుండి యూదులను పీడించి దేశం నుండి బైటికి వెళ్లగొట్టాడు. క్రీ.పూ. 1300లో వారు మళ్లీ ఇజ్రాయిల్ చేరుకొన్నారు.

వారి రెండవ నిష్క్రమణ క్రీ.పూ. 598లో బాబిలోనియా చక్రవర్తి ద్వారా జరిగింది. దాని కాలావధి 50 సంవత్సరాలు. క్రీ.పూ. 650లో రోమ్ చక్రవర్తి ఇజ్రాయిల్‌ను తన స్వాధీనం చేసుకొని క్రీ.శ. 135 వరకు యూదులను ఇజ్రాయిల్‌కు రానీయలేదు. చివరి సారి వెళ్లగొట్టబడిన తరువాత 1850 సంవత్సరాల వరకు ఒక్క భారతదేశంలో తప్ప ప్రపంచంలోని మిగతా అనేక దేశాలలో వారి మీద అనేక అత్యాచారాలు జరిగాయి. వారిలో చాలామందిని ఆయాదేశాలలో చంపేశారు. జర్మనీ నియంత హిట్లరు యూదుల సమస్యకు చివరి పరిష్కారంగా 60 లక్షల మంది యూదులను చంపించి వేశాడు. ఇలాంటి అత్యాచారాలన్నింటిని సహించి జీర్ణించుకొని 14.5.1948 నాడు యూదు జాతి తన మాతృ భూమిలో మరొక్క సారి స్వాతంత్ర్యం పొందింది. ఇదే వారి జాతీయ భావన లోని శక్తి. ఈజిప్టు, రోమ్, హిట్లర్ మొదలైన వారంతా యూదులను సర్వనాశనం చేయాలని ప్రయత్నించిన వారే. అట్టి శక్తులన్నీ అది ఈజిప్టు గాని, రోమ్ గాని, హిట్లరు గాని చివరకు తామే సర్వనాశనమయ్యాయి.

యూదుల మొదటి నాయకుడు అబ్రహం. ఆ కాలంలో అంటే క్రీ.పూ. 1600 ప్రాంతంలో వారిలో సామాజిక స్పృహ గోచరమవుతుంది. ఇజ్రాయిల్ మొదటి పేరు ''కనాన్'' ''మీ సంతానానికి నేనీ భూమిని ఇస్తున్నా'' అని పరమేశ్వరుడు అబ్రహాంతో చెప్పినట్లు కనాన్ గురించిన ప్రస్తావన ఓల్డు టెస్టుమెంట్‌లో ఉల్లేఖించబడింది. ఈ విధంగా మొదటి నుండి యూదులలో ఈశ్వర ప్రసాదంగానే ఈ భూమి తమకు లభించిందనే పరమ పవిత్ర భావం ఏర్పడింది.

ఈనాడు ఇజ్రాయిల్ తన స్వతంత్ర్య అస్తిత్వం ప్రకటించుకొన్నందువల్ల ఆ సమాజం గురించి తెలుసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. అత్యాచారాల మూలంగా వారి నడుము, తల కూడా వంగిపోయాయి. కాని ఇప్పుడు వారి నడుములు నిటారుగా ఉన్నాయి. వారు సగర్వంగా తల ఎత్తుకొని ఉన్నారు.

ఇజ్రాయిల్‌కు ఒకవైపు సముద్రం, మిగతా మూడు వైపులా ముష్కరులైన బద్ధ శత్రువులు అరబ్బుల రాజ్యాలున్నాయి. సంఖ్యాపరంగా చూస్తే యూదు అరబ్బుల జనాభా 1:40 నిష్పత్తిలో ఉంది. ఐనా అరబ్బులతో జరిగిన ప్రతి యుద్ధంలో ఇజ్రాయిలే విజయం సాధిస్తూ ఉండేది. వారిలో ఉండే ఆత్మ విశ్వాసం, మతం పట్ల వారి శ్రద్ధ, పొంగి పొరలే ప్రఖర జాతీయ భావనలే వారి ఘనవిజయాలకు మూలకారణములయ్యాయి. వాటి ఆధారంగానే ఈనాడు ఇజ్రాయిల్ అత్యంత ప్రాచీనము, అత్యంత ఆధునికము కూడా అయి ఉంది. ఈనాడు సంక్షోభంలో సతమతమయ్యే ప్రపంచ మానవులకు ఇజ్రాయిల్ ఒక అపూర్వ విశ్వాస నిర్మాణ కేంద్రంగా ఉజ్వలంగా ప్రకాశిస్తూ ఉంది. దానివలెనే విజయాలు సాధించాలనే దేశాలకు ఇజ్రాయిల్ చక్కని మార్గదర్శకము అవశ్యక అనుకరణీయ మైన దేశంగా వెలుగొందుతూ ఉంది.

## చైనా:

చైనా ప్రాచీన సాంస్కృతిక చరిత్ర నాలుగున్నర, ఐదు వేల సంవత్సరాల పురాతనమైంది. చీనా వంశ రాజ్యం అక్కడ క్రీ.పూ. 1600 సం.లో ప్రారంభమైంది. క్రీ.పూ. ఆరు, ఏడు శతాబ్దాలలో లావోత్సే కన్ఫ్యూషియస్, మేనసియస్ మొదలగు తత్వ వేత్తలు అక్కడి సంస్కృతిని పరిపుష్టం చేశారు.

లావో సిద్ధాంతం, కన్‌ఫ్యూషియన్ సిద్ధాంతంతో పాటు బౌద్ధ మతం కూడా సహజీవనం చేసింది. జపాన్ వలెనే ఇక్కడ కూడా మూడు మతాలు పరస్పరం కలిసి మెలిసి జీవించాయి. చైనా లిపి ఒక్కటే అయినందు వల్ల

ఏకాత్మతా భావ నిర్మాణానికి తోడ్పడింది.

వేల సంవత్సరాల చైనా జీవన కాల ఖండంలో ఐరోపీయుల కంటె ముందు చాలా మంది ఆక్రమణ కారులు చైనాపై విజయం సాధించారు. కాని కొంత కాలం తర్వాత చైనా సంస్కృతి వేదాంతాల ప్రభావ కారణంగా విదేశీ ఆక్రమణకారులంతా చైనా సమాజంలో విలీనమైపోయారు. విదేశీ ఆక్రమణ కారులు సైనికంగా చైనా కంటే బలవంతులైనా చైనా సాంస్కృతికంగా సామాజికంగా వారికంటే శ్రేష్ఠమైన కారణంగా వారిని అది తనలో సులభంగా విలీనం చేసుకోగలిగింది.

15వ శతాబ్దానికి ముందు అరబ్ వ్యాపారుల ద్వారా చైనాకు పాశ్చాత్య దేశాలతో సంబంధం ఉండేది. ఇప్పుడక్కడ ఐరోపా వాసుల ప్రభావం ఎక్కువవుతున్నది. వారి ముఖ్య లక్ష్యం ఆర్థిక ప్రయోజనమే. అందువల్లనే వారు ఆర్థిక సామ్రాజ్య వాదాన్ని విస్తరింపజేశారు. చైనా ప్రభుత్వ ఆర్థిక ఇబ్బంది, సైనిక బలహీనత ప్రభుత్వ యంత్రాంగ అసమర్థత మొదలగు కారణాల వల్ల చైనాలో ఐరోపావాసుల ఆర్థిక సామ్రాజ్యవాదం విజయవంతమైంది. ఐనా చైనా ప్రజల సుదృఢ జాతీయ భావన కారణంగా దాని ఉనికి కూడా పరిమితంగానే ఉండిపోయింది. విదేశీ వ్యాపారుల ఆర్థిక పీడనను, మిషనరీల రాజకీయ మత రంగాలలోని జోక్యాన్ని చైనా సమాజం ఎంతమాత్రం సహించలేక పోయింది. చైనా దేశపు అపరిమిత వైశాల్యం, అత్యధిక జనాభా కారణాలుగా విదేశీ జోక్యాన్ని తగినంతగా ఎదుర్కొనేట్లు సమాజం సంఘటితం కావడానికి కొంత ఆలస్యమైతే జరిగింది కాని చివరకు 1911లో సన్యత్‌సేవ్ నాయకత్వంలో జాతీయ ప్రభుత్వ విప్లవం చెలరేగి విజయం సాధించింది. కొన్ని సంవత్సరాల తరువాత చైనా కారల్ మార్క్స్ ప్రబోధించిన సామ్రాజ్యవాద సిద్ధాంతాన్ని స్వీకరించింది. కాని అది కూడా తన జాతీయతకు అనుకూల పడే విధంగానే. అందుకే చైనా కారల్-మార్క్స్

వాదాన్ని చీనీకరణ గావించిందని చెప్పవచ్చు.

## భారతదేశం

భారదేశంలో జాతీయ జీవన ఆవిర్భావం ఎప్పుడు జరిగిందో నిర్ణయించడం అత్యంత కష్టం, వేదాలు భారతీయుల అతి ప్రాచీన సాహిత్యం, దాని కాల నిర్ణయం ఇంత వరకు జరగలేదు. అతి ప్రాచీనమైన వేద కాలం నుండి ఈనాటి వరకు భారతీయుల జాతీయ జీవనం నిరంతరం కొనసాగుతూనే ఉంది. వేదాలలో అనేక చోట్ల ''జాతి''పదం వచ్చింది. అధర్వణ వేదంలో అయితే జాతి నిర్మాణ ప్రయత్నాలు ఏరకాల మనుష్యులు ఏలక్ష్యంతో, ఏ విధంగా చేశారో ఋషులు వర్ణించారు.

భద్రం ఇచ్ఛంత ఋషయఃస్వర్విదః తపోదీక్షా ముపాసేదుః అగ్రే
తతో రాష్ట్రం బలం ఓజశ్చజాతం తదస్మై దేవా ఉపసం నమంతు॥
(19-41-9)

భావం:- ఆత్మ జ్ఞానులైన ఋషులు లోక కళ్యాణం కోరుతూ సృష్టి ప్రారంభంలో దీక్షతో చేసిన తపస్సు నుండి జాతి నిర్మాణమైంది. జాతీయ శక్తి, ఓజస్సు, తేజస్సులు కూడా ప్రకటితమైనాయి. అందువలన మేధావులు వివేకులు అయిన విబుధులందరూ ఈ జాతికి మోకరిల్లి దీనికి సేవ చేయాలి.

వేదకాలం నుండి భారత జాతి చాలా ఉచ్ఛస్థితిలో ఉండేదాని పైన పేర్కొనబడిన అధర్వవేద ప్రస్తావన బట్టి తెలుస్తుంది. ఈనాటి భారతీయ పాఠ్యపుస్తకాలలో ఆంగ్లేయులు నిర్ణయించిన వేద కాలం గురించి ఉంది. అది క్రీ.పూ. 1200. మాక్సుముల్లర్ దీనిని క్రీ.శ. 1850లో చెప్పాడు. సుదీర్ఘ అధ్యయనం తరువాత 1890లో అతడొక ఉపన్యాసంలో వేదకాలం క్రీ.పూ. 1200 అన్నది తన ఊహ మాత్రమే అని ఋగ్వేద ప్రాచీనత, కాల నిర్ణయాల గురించి ఊహించడమే సాధ్యం కాదని ప్రకటించాడు కూడా.

ఇదే జాతి నిర్మాణం గురించి భారతీయులు చేసిన ప్రయత్నం సృష్టి ప్రారంభంలోనే జరిగిందని అధర్వణ వేదంలో ప్రస్తావించబడింది. అధర్వణ వేదంలో దాని ప్రస్తావన చేయక ముందు ఇంకా ఎంతకాలం గడిచిందో స్పష్టంగా తెలియదు. అతి ప్రాచీన కాలం నుండే భారతదేశంలో జాతీయ భావం నెలకొని ఉండేదని దీనిని బట్టి మనకు తెలుస్తుంది.

హరప్పా నాగరికత కాలం క్రీ.పూ. 2500 - 3000 అని నిర్ణయించబడింది. ఖైబర్ కనుమకు సమీపంలోని హరప్పాగా ప్రసిద్ధి పొందిన మెహర్‌గడ్ ప్రాంత కాల ఖండం క్రీ.పూ. 8000 సంవత్సరాలని క్రీ. శ. 1886లో చెప్పబడింది. హరప్పా ప్రాంతంలో యజ్ఞశాలలు కనిపించాయి. ఆ కాలంలో అక్కడ వైదిక సంస్కృతి నెలకొని ఉండేదని దీనిని బట్టి మనకు తెలుస్తుంది.

సరస్వతీ నదిని గురించి అది అన్ని నదుల కంటే చాలా పెద్దనది అని వేదాలలో వర్ణించబడింది. ఆ నది ఇప్పుడు లేదు. క్రీ. పూ. 1800 కంటే అనేక వేల సంవత్సరాల పూర్వమే అది ఇంకిపోయి ఉంటుందని ఉపగ్రహాల ద్వారా లభించిన ఆధారాలను బట్టి శాస్త్రజ్ఞులు తెలియజేశారు.

1891లో హైదరాబాదులో జరిగిన ఖగోళ శాస్త్రజ్ఞుల అంతర్జాతీయ చర్చా సదస్సులో ఖగోళ శాస్త్రం ఆధారంగా వేదకాలం క్రీ.పూ. 7 వేల సం॥ - అంటే ఇప్పటికి 9 వేల సం॥ పూర్వమని పేర్కొనబడింది.

ఈవిధంగా భారతదేశ సామాజిక భావన సంస్కృతి, జాతీయత ప్రపంచంలోని ఇతర సమాజాలన్నింటికంటే ప్రాచీనమైనవని ఋజువవుతుంది. వెనుక కవరుపైన ఈయబడిన పట్టికను చూస్తే ఈ విషయం ఇంకా స్పష్టంగా తెలుస్తుంది.

# శ్రేష్ఠత

అనాది కాలం నుండి భారతీయుల జాతీయ జీవనం వారి సంస్కృతిననుసరించి నిరంతరం కొనసాగుతూ వస్తున్నది. ప్రపంచంలో భారతీయ సమాజ శ్రేష్ఠత్వం ఎట్లాంటిదో దీనిని బట్టే తెలుస్తుంది. భారతీయ సంస్కృతిలో గల కొన్ని ప్రత్యేకతలు ఉత్తమ గుణాల కారణంగానే ఇది సాధ్యమైంది.

భారత జాతీయ జీవనం కేవలం సుదీర్ఘమగుట వలన మాత్రమే కాక అందలి శ్రేష్ఠత్వాన్ని ఋజువు చేసే విషయాలు కొన్నింటిని గురించి ప్రస్తుతం పరిశీలిద్దాం.

జాన్ బి. స్పార్క్ అనే అమెరికన్ పండితుడు క్రీ.పూ. 2000 నుండి క్రీ.శ. 1975 వరకు యావత్ ప్రపంచ దేశాల జాతీయతల పుట్టుకను, పతనాన్ని తెలియజేస్తూ ఒక చిత్రపటాన్ని తయారు చేశాడు. రైండ్ ఎమ్‌నెలీ అండ్ కంపెనీ అనే సంస్థ దానిని ప్రచురించింది. క్రీ. పూ. 2000 నుండి ఈనాటి వరకు నిరంతరం కొనసాగుతూ వచ్చిన జాతీయ జీవనం గల భారత్, చైనా దేశాలనే ఆ చిత్ర పటంలో చూపాడు. క్రీ. పూ. 2000 నాడు నెలకొని ఉన్న నాగరికతలు, వాటితో భారతదేశానికి గల పోలికలను గురించి ముందు మనం పరిశీలిద్దాం.

గ్రీకు రోమను నాగరికతల నుండే ఈనాటి పాశ్చాత్య దేశాలు స్ఫూర్తిపొందాయి. ఇంతే గాక ఈ పాశ్చాత్యుల ఆలోచనలే ఈనాడు ప్రపంచాన్ని ప్రభావితం చేస్తున్నాయి. అందువల్ల గ్రీకు రోమను నాగరికతలను గురించి పరిశీలిద్దాం. చివరగా ఈనాటి ప్రపంచ వ్యాప్త నాగరికత కంటే భారత నాగరికత ఏవిధంగా శ్రేష్ఠమైందో పరిశీలిద్దాం.

క్రీ.పూ. 2000 సం. నాటి మానవ నాగరికతలు అన్నిటికంటే అతి ప్రాచీనమని భావించబడుతున్నాయి. అలాంటి ప్రాచీన కాలంలో అనేక జీవనదులు మానవ సంస్కృతి ఏర్పడటానికి దాని అభివృద్ధికి దోహదం

చేశాయి. అలాంటి ప్రముఖ నదులలో సరస్వతి, సింధు, దజల, ఫరహాత్, నైల్, హోయాంగ్‌హో మొదలగునవి పేర్కొనదగినవి. నాటి నాగరికతలన్నీ ఆసియా ఖండంలోనూ దానికి పశ్చిమాన ఆనుకొని ఉన్న ఈజిప్టులోను నెలకొని ఉండేవి. ఇవి కాక ప్రపంచంలో మరెక్కడా నాగరికతలు లేవు. దజల, ఫరహాత్ నదుల తీరాన ఉన్న మెసపొటేమియాలో నెలకొన్న సుమేరియా, బాబిలోనియా, దానికి కొంత కాలం తరువాత అక్కడే అభివృద్ధి చెందిన అస్సీరియా అనే మూడు నాగరికతల గురించి పరిశీలిద్దాం.

## సుమేరియా

ఫారస్ (పర్షియా) అఖాతానికి ఉత్తరంలో దజల, ఫరహాత్ నదుల ముఖ ద్వారంలోగల భూభాగం పూర్వకాలంలో సుమేరియాగా ప్రసిద్ధి చెందింది. పశ్చిమ ఆసియాలో ప్రప్రథమంగా సుమేరియా రాజ్యం వెలసింది. అక్కడిప్రజలు విగ్రహారాధకులు. వారు తమ సంవత్సరాన్ని 12 నెలలుగా గణించే వారు. కాని వారిది చాంద్రమానం. అందువల్ల ప్రతి మూడు సంవత్సరాలకు అధిక మాసం వచ్చేది. శుక్ల పాడ్యమి నాటి చంద్రుని, అర్ధ చంద్రుని, పౌర్ణమి నాటి చంద్రుని వారు హర్షాతిరేకంతో ఉత్సాహంతో స్వాగతించేవారు.

భారతీయుల సంవత్సర విభజనలో కూడా ప్రతి మూడు సంవత్సరాలకు ఒక నెల పెరుగుతుంది. దీనిని అధిక మాసమని లేక పురుషోత్తమ మాసమని అంటారు. ఆ మాసంలో ధార్మిక కార్యాలను అధికంగా చేసే సంప్రదాయం ఉంది. శుక్లపాడ్యమి నాటి చంద్రుని గొప్పతనం కనిపించి, కనిపించక కనిపించడమే. చంద్రుని వలన అన్నవస్త్రాదులు కలుగుతున్నాయి. అటువంటి చంద్రునికి శుక్ల పాడ్యమి నాడు నూలుపోగు సమర్పించే ఆచారం ఉంది. దీనిని బట్టే చంద్రునికో నూలుపోగు అనే సామెత పుట్టింది. శుక్ల పాడ్యమితో పాటు అష్టమి పూర్ణిమలకు భారతీయులు ఎక్కువ ప్రాముఖ్యతనిస్తారు.

సుమేరియాలో భారతదేశంలో వలెనే బహుదేవతోపాసన వాడుకలో ఉండేది. దేవీదేవతలకు పండ్లు పాలు వెన్న పశువుల మాంసంతో పాటు అప్పుడప్పుడు నరబలిని కూడా సమర్పించి పూజలు చేస్తుండేవారు. దేవాలయాలలో దేవదాసీల సంప్రదాయం కూడా అక్కడ ఉండేది.

ఈరాన్ (ప్రాచీన సుమేరియా) దేశపు అతి ప్రాచీన గ్రంథం పేరు ఝుండ్ అవెస్థా. అక్కడ అగ్ని పూజ, హోమం, యజ్ఞం మొదలగు అనేక కర్మలు భారతీయ పద్ధతిలోనే జరుగుతుండేవి. ఝుండ్ భాషలోని పదాలకు సంస్కృత పదాలకు చాలా పోలికలున్నాయి. ఉదా: సంస్కృతి - హరహయవతి; సప్తసింధు - హప్త హిందు; నాసత్య - నాహత్య; గాథా - మాథా, వృత్రఘ్న - వేరే త్రఘ్న మొ॥. భాషా శాస్త్ర దృష్టితో సకారం సహజంగానే సహకారంగా మారుతుంది. ఉదా:- సప్తాహ-హప్తాహ; ఝుండ్ భాషా పదాల మీద సంస్కృత భాషా ప్రభావం చాలా ఉన్నదని అందరూ అంగీకరించిన విషయమే. 

## బాబిలోనియా



క్రీ.పూ. 14వ శతాబ్దంలో బాబిలోనియాలో ఎమోరిత్ (అమృత్?) వంశానికి చెందిన 6వ రాజు హమ్మూ్మ ~~సత్వా~~ రావా న్యాయ పద్ధతి, చట్టాల క్రోడీకరణ చేసినందువల్ల ఆ రాజు చాలా ప్రసిద్ధుడైనాడు. అతడు వ్రాసిన లేఖను బట్టి ఈ విజ్ఞానం అతనికి శంస్ (సూర్యుని) నుండి లభించింది. బాబిలోనియాలో దేవీ దేవతల సంఖ్య 60 వేలు దాటింది. దేవతల పూజ ప్రాతః కాలంలో, సాయం వేళ, అర్ఘ్యం, తైల అభ్యంగం, ధూపదీప నైవేద్యాలు, భజనలు, స్తోత్రాలతో కూడి పూర్తిగా భారతీయ పద్ధతిలో జరుగుతుండేవి.

క్రీ.పూ. 1760లో బాబిలోనియాలోని కసాయిట్ రాజవంశానికి చెందిన రాజుల పేర్లలో సూర్యుడు, ఇంద్రుడు, మరుత్తు మొ॥ భారతీయ పదాలు కనిపిస్తాయి. యుఫ్రెటిస్ కనుమలోని హిట్టాయిట్, మిత్తానీ రాజుల

మధ్య జరిగిన యుద్ధం తరువాత క్రీ.పూ. 1360లో జరిగిన సంధికి సంబంధించిన పత్రంలో ఇంద్ర, మిత్ర, వరుణ, నాసత్య మొ॥ భారతీయ దేవతల సాక్షి సంతకాలున్నాయి. దీనిని బట్టి ఆ కాలంలో బాబిలోనియాలో ఈ దేవతలకు ఎంత గౌరవాదారాలుండేవో స్పష్టమవుతుంది. ''తేల్ అల్ అమర్నా''లో దొరికిన ప్రాచీన శిలా ఫలకాలలో ఉన్న సిరియా, ఫిలిస్తీన్ (పాలస్తీనా) రాజుల పేర్లు భారతీయుల పేర్లను పోలి ఉన్నాయి. బాబిలోనియాలోని భూగర్భం నుండి లభించిన శిలాఫలకంలో భారతీయ వైద్య శాస్త్రజ్ఞులైన చరక, సుశ్రుతుల ఔషధ ప్రయోగాలు వ్రాసి ఉన్నాయి. చరక, సుశ్రుత సంహితలు, ఆయుర్వేదంలో అతి ప్రాచీన గ్రంథాలు కేవలం భారతదేశంలోనే కాక ప్రపంచ వైద్య గ్రంథాలన్నిటికంటె అవి అత్యంత ప్రాచీనమైనవి. ఈ గ్రంథాలలో చెప్పబడిన ఔషధ యోగాలు బాబిలోనియాలో లభించినందువలన అక్కడి ప్రజలకు భారతీయ వైద్య పద్ధతి బాగా తెలిసి ఉండేదని భావించవచ్చు.

## అస్సీరియా

సుమారు క్రీ.పూ. 1760లో సుమేరియా బాబిలోనియా రాజ్యాలు పతనం చెందిన తరువాత అస్సీరియా అవతరించింది. దజలా నదికి ఇరువైపులా అస్సీరియా పర్వత రాజ్యం ఉండేది. సుర అసుర పదాలు రెండూ పరస్పర శత్రువులుగా వైదిక పౌరాణిక సాహిత్యంలో వర్ణించబడ్డాయి. స్వయంగా అస్సీరియా అనే పదం భారతీయ పదమైన అసుర నుండి ఏర్పడినట్లు గోచరిస్తున్నది.

అస్సీరియా ప్రముఖ దేవత అహురమజ్ద్ కూడా అసుర మహత్ అనే పదానికి అపభ్రంశమై ఉంటుంది. అస్సీరియా రాజులు తమది సూర్యవంశమని చెప్పుకొనే వారు. భూత, ప్రేత, తంత్ర, మంత్రాలపై వారికి అమితమైన విశ్వాసం. శకునాల్ని, వారెంతగానో పాటించేవారు.

భారతీయ అధర్వణ సంప్రదాయ సమ్మతమైన చికిత్సా విధానం అస్సీరియాలో వాడుకలో ఉండేది. దానిని అధర్వణో చికిత్సా అంటారు. దాని ప్రకారం హోమం, యజ్ఞం, బలి, మంత్ర తంత్రాలు, కొన్ని ప్రత్యేక ఔషధాల సేవనం వలన రోగ చికిత్స జరుగుతుంది. అధర్వణ వేదంలోని చాలా భాగంలో ఈ వైద్య పద్ధతి వర్ణించబడి ఉంది. అధర్వణీయ వైద్య పద్ధతే కొన్ని మార్పులతో కూడి అస్సీరియాలో వాడుకలో ఉండేది. ఆయుర్వేద అష్టాంగాలలో భూత విద్య కూడా ఒక స్వతంత్ర భాగం. శకునాల గురించి భారతీయ శకున శాస్త్రంలో ప్రత్యేకంగా వర్ణించబడింది. వైద్య శాస్త్రంలో కూడా శకునాలకు తగిన స్థానం ఉంది. చరక సంహిత ఇంద్రియ స్థానంలో దూతాధికార ప్రకరణంలో వీటి విస్తృత వర్ణన మనకు లభిస్తుంది. ఈ సంహిత ప్రపంచవైద్య గ్రంథాలలో మిక్కిలి ప్రాచీనమైంది.

### ఈజిప్టు

ఈజిప్టు నైలునదీ ప్రసాదంగా చెప్పబడుతుంది. సహారా ఎడారి, ఎర్ర సముద్రం మధ్య ఉన్న ఈజిప్టు భూభాగం మీద నైలునది అనుగ్రహం చాలా ఉంది. ఇక్కడి చక్రవర్తులకు ''ఫరోహా''లు అని పేరు. ఇక్కడి ప్రజలు వివిధ రంగాలలో మంచి అభివృద్ధిని సాధించారు. వాస్తు కళలో వారు సిద్ధహస్తులు. వారు నిర్మించిన పిరమిడులు విశ్వవిఖ్యాతి పొందాయి. పిరమిడ్ ఒక రకమైన సమాధి. అక్కడి రాజుల శవాలు పిరమిడ్లలో భద్రపరచబడ్డాయి. వేల సంవత్సరాలకు పూర్వమే శవాలను భద్రపరచే విధానాన్ని వారు కనుగొన్నారు.

భారతీయులకూ ఈ విషయం తెలిసి ఉండేది. భరతుని అయోధ్యకు తీసుకొని వచ్చే వరకు దశరథ మహారాజు శవం భద్రంగా ఉంచబడింది. కాని భారతీయుల దృష్టి అశాశ్వతమైన వాటి మీద కంటే శాశ్వతమైన వాటిమీదే ఉండేది. నశించే శరీరం మీద వారికి జీవించి ఉన్నప్పుడు కూడా ఎక్కువ మమకారం ఉండేది కాదు. అందువల్ల వారు ఇలాంటి ప్రక్రియను

ప్రోత్సహించలేదు. చనిపోయిన తరువాత కూడా భూమిని అంటిపెట్టుకొని ఉండే ఆలోచన భారతీయులలో ఎప్పుడూ లేదు. శవాన్ని అగ్నికి సమర్పించి వారు దేహానికి, దేశానికి కూడా మేలు చేసేవారు.

ఈజిప్టు ప్రజలు అంకగణితం, రేఖాగణితం, సాహిత్యం, నీటిపారుదల సాధనాలు, వెదురు నుండి కాగితం తయారు చేయడం మొదలగు విషయాలను కనిపెట్టారు. వైద్య శాస్త్రం కూడా ఈజిప్టులో అభివృద్ధి చెందింది. దేవతల మీద రాక్షసుల మీద ప్రజలకు విశ్వాసం ఉండేది. అందువల్ల వారి వైద్య పద్ధతి భారతీయ వ్యపాశ్రయ వైద్య పద్ధతిని పోలి ఉండేది. ఈ పద్ధతిలో దేవతల మీద విశ్వాసంతో రోగానికి కారణం వారేనని భావించి వారిని శాంతింపజేయడానికి బలి హోమాలు చేయబడతాయి. సూర్య దేవతను వారు సర్వ శ్రేష్ఠ వైద్య దేవతగా భావించారు. ''ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్'' అని భారతీయులు చెప్పారు. ఈ వైద్యంతో పాటు అనేక ఔషధాలు కూడా వాడేవారు. వాటిలో చాలా ఔషధాలను భారతదేశం నుండి తెప్పించుకొనేవారు.

భారతీయ ఈజిప్టు భాషలలో చాలా పదాలు వాటి అర్థాలు ఒకే తీరుగా ఉన్నాయి. ఉదా: హరి(సూర్యుడు) హోరస్ - ఈశ్వరుడు - ఓసిరిస్; ఈశ్వరీ - ఇసిస్; శివ - సేవ్; శక్తి - సేఖేత్; శ్వేత్ - సేత్; సూర్యవంశీ - సురియస్; క్షత్రీయ - ఖేత్: మిత్ర - మిథ్; శరద్ - సరదీ; రవి - రా; మొదలగునవి.

అక్కడి చక్రవర్తి ఏఖనాతోన్ (ఏకనాథన్) క్రీ.పూ. 1370లో ఏకేశ్వరవాదాన్ని బహిరంగంగా సమర్థించారు. మొత్తం ప్రపంచానికి ఏకైక ఆధారం భగవంతుడే అని అనేక రూపాలలో అతనిని పూజించాల్సిన అవసరం లేదని అతడు ప్రకటించాడు. భారతదేశంలో బహుదేవతారాధనలతో పాటు ఏకేశ్వరోపాసన కూడా వాడుకలో ఉంది.

ఏకోదేవో సర్వ భూతేషు గూఢః సర్వ వ్యాపీ సర్వ భూతాంతరాత్మా
కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ॥

ఈ విధంగా భారతదేశంలో ఆ పరమ పిత ఉనికిని, కార్య కలాపాలను, జీవాత్మతో అతనికుండే సంబంధాన్ని గురించి నిరూపించబడింది. ఈ శ్లోకభావమే ఏఖనాతోన్ ప్రకటనలో ప్రతిధ్వనించింది.

భారతదేశ శ్రేష్ఠత గురించి ఆలోచించే సమయంలో జనజీవనం సాగుతున్న నాలుగు దేశాల గురించి తెలుసుకొన్నాము. క్రీ.పూ. 2000 సం. కాలఖండం తరువాత ప్రారంభమై ప్రస్తుతం కాలగర్భంలో కలిసిపోయిన ఐరోపా దేశాల గురించి ఆలోచిద్దాం. గ్రీకు రోము నాగరికతలు ఈ కోవకు చెందినవి. ఈనాటి ఐరోపా దేశాలు వీరి నుండి లిపి మొదలగునవి కొన్ని విషయాలు గ్రహించారు. ఐరోపా ప్రజలకు వారి పట్ల అభిమానం కూడా ఉంది.

## గ్రీసు (యునాన్)

ప్రాచీన కాలంలో గ్రీసు దేశం చాలా బీదది. కాని ఉత్సాహవంతులు శక్తి సామర్థ్యాలు గలవారునైన గ్రీకు ప్రజలు కఠిన పరిశ్రమ చేసి తమ పరిస్థితిని మెరుగుపరచుకొని సర్వశ్రేష్ఠులమని భావించుకొన్నారు.

ఏల్స్ పండితుడు (క్రీ.పూ. 624-548) గణించి సూర్యగ్రహణం వచ్చే సంగతిని ముందుగానే ప్రకటించాడు.. భారతీయ వైద్య పద్ధతి గ్రీకు వైద్య పద్ధతి మీద ఈజిప్టు, ఈరాన్, మొదలగు దేశాల ద్వారా పడిన ప్రభావం ప్రత్యక్షంగా, పరోక్షంగా చాలా ఉంది. యూనాన్ ప్రజలు ఎన్నో విషయాలు ఈజిప్టు, ఈరాన్ మొదలగు దేశాల నుండి నేర్చుకొన్నారు. వాటి ప్రాచీన సంస్కృతుల మీద భారతదేశ ప్రభావం చాలా ఉంది. ఈ విషయం మనం ఇదివరకే తెలుసుకొన్నాం. నలందా విశ్వవిద్యాలయంలో ఫలానా రోగానికి చికిత్స ఫలానా విధంగా చేయబడుతుండేదని డోరోతియా శాస్త్రంలోని శరీర విజ్ఞానంలో విదేశీ పదం ఒక్కటి కూడా లేదు. అదే పాశ్చాత్య వైద్య శాస్త్రంలో శారీరక అవయవాలను సూచించే పదాలలో ప్రాచీన భారతీయ

శబ్దాల పోలికలు కనిపిస్తాయి. ఉదా: శిరో(బహ్మ తలపై భాగంలో కపాల అస్థికలకుండే సిరల మధ్య బిందువును శిరో(బహ్మ అంటారు, దానికే లాటిన్ భాషలో సెరె(బమ్ (Cerebellum) 'హృద్'కి 'హార్ట్ (Heart) మొదలగునవి.

ఆయుర్వేదంలోని ఇద్దరు అశ్వినీ కుమారుల జంటకు చాలా (ప్రసిద్ధి గలదు. వారి పేరులోనే అశ్వం అనే పదం ఉంది. వారు గు(రం మీద స్వారీ చేసేవారు. వారు దేవతలకు వైద్యులు. కాని అప్పుడప్పుడు ఆయుర్వేదంతో మానవులకు కూడా వైద్యం చేసేవారు. పూర్తిగా ఇదే విధంగా యూనానులో క్యాస్టెర్, పోలుప్స్ అనే దేవతల జంట ఉంది. వారు తెల్లటి గు(రాల మీద స్వారీ చేస్తూ రోగులకు రక్షణ కల్పిస్తూ ఉండేవాళ్లు.

ఐరోపాకు చెందిన మొదటి దార్శనికుడు (తత్వవేత్త) ప్లేటో పైథాగరస్ అను వారిద్దరు తత్వ శా(స్త్రానికి సంబంధించి భారతీయులకు ఎంతో ఋణపడియున్నారని మోనియర్ విలియమ్స్ అనే (ప్రముఖ చరి(త కారుడు ఉటంకించాడు. అనగా (గీకు దేశపు (ప్రముఖ తత్వవేత్తలైన సో(క్రటీస్ ప్లేటో, అరిస్టాటిల్ మొదలగు వారి వేదాంత (గంథాల మీద భారతీయ వేదాంత (గంథాల (ప్రభావం చాలా ఉంది అని అర్థం. పై తత్వవేత్తలు భారతీయ సిద్ధాంతాలనే వారు స్వీకరించారు. (ప్రసిద్ధ తత్వవేత్త గణిత శా(స్త్రజ్ఞుడు వైద్య శా(స్త్రజ్ఞుడూనైన పైథాగరస్ భారతదేశానికి వచ్చాడని W. Hamilton (హామిల్టన్) తన History of Medicine (వైద్య చరి(త) లో పేర్కొన్నాడు. దానితో పాటే పైథాగరస్ వైదిక పద్ధతిని (ప్రచారం చేశాడని కూడా అతడు రాశాడు. పైథాగరస్ సిద్ధాంతం బౌద్ధాయన - సులభ - సూ(తంగా భారతదేశంలో మొదటి నుంచి ఉంది.

(ప్రాచీన (గీకు దేశం మీద భారతీయుల (ప్రభావం తప్పని సరిగా ఉందని దీనిని బట్టి మనకు తెలుస్తుంది. (ప్రపంచంలోని మొట్టమొదటి వైద్య (ప్రణాళికను రూపొందించినందుకు మేము హిందువులకు ఋణపడి ఉన్నామని డా.రాయల్ కూడా ఒప్పుకొన్నాడు. (Civilization of India Part II Page 249)

పైథాగరస్ భారతీయుల బ్రహ్మచర్యాశ్రమ పద్ధతిని చూసి ఎంత ప్రభావితుడైనాడంటే అతడు తన దగ్గరకు చదువుకొనడానికి వచ్చిన విద్యార్థులకు బ్రహ్మచర్య (్రత పాలన తప్పనిసరి అని నియమం పెట్టాడు. గ్రీకు దేశీయులకు ఇది చాలా కొత్త విషయం. అనేక వందల మంది అతని శిష్యులు ఆజీవన నైష్ఠికబ్రహ్మచర్యవ్రతాన్నే పాలిస్తూ అతని సిద్ధాంతాలను ధార్మికతను, వైద్య పద్ధతిని గ్రీకు దేశం అంతటా వ్యాపింపజేయడానికి దీక్షా కంకణబద్ధులైనారని కూడా చారిత్రక ఆధారాలను బట్టి తెలుస్తూ ఉంది.

క్రీ.పూ. 3వ శతాబ్దంలో (Theo Frests) థియో ప్రెస్టస్ భారతీయులనుండే జ్ఞానాన్ని సంపాదించాడని క్లాసియన్ భారతీయుల వైద్య శాస్త్రం నుండే ద్రవ్య విజ్ఞానాన్ని స్వీకరించాడని, ఇంతేగాక ఆధునిక వైద్య శాస్త్రపిత హిపోక్రిటస్ కూడా భారతీయులనుండి సంపాదించిన జ్ఞానం ఆధారంతోనే తన ద్రవ్యగుణ విజ్ఞాన శాస్త్రాన్ని వ్రాశాడని డా. రాయల్ పేర్కొన్నాడు. పరమాత్మని మనస్సులో ఆత్మశక్తి ద్వారా ప్రేరితమైన ఆలోచన వచ్చి ప్రకృతి జీవతత్వాలు ఉద్భవించాయని పరమాత్మయే విభిన్న రూపాలతో, విభిన్న నామాలతో నెలకొని ఉంటాడని ప్లేటియస్ (క్రీ.శ. 203-270) అనే రహస్యవాద దార్శనిక మహాపురుషుడు అభిప్రాయపడ్డాడు. ''సఏకాకీ నరమతే'' ఏకోహం బహుస్యామ'' భగవంతునికి ఒంటరిగా ఉండటం ఇష్టం లేక అనేక మందిగా కావాలని కోరుకున్నాడు. ప్లేటియస్ ఉద్దేశం కూడా ఇదే. ప్రకృతి జీవతత్వాల గురించిన ఆలోచన భారతదేశంలో చాలా పూర్వ కాలంలోనే జరిగింది. పరమాత్ముడొక్కడే విభిన్న నామ రూపాలతో వెలుగొందుతున్నాడని ప్లేటియస్ అన్నాడు. ''నామ రూప విభేదేన ఫలగవ్యా చ కలయాకృతా'' అని భారతీయులు చెప్పారు. అంటే పరమాత్ముడు తన కళల ద్వారానే అసంఖ్యానామ రూపాలను ధరిస్తూ ఉంటాడని అర్థం. శారీరక బంధనాల

నుండి విముక్తి చెంది విశ్వాత్మలో పిదప పరమాత్మలో లీనం కావడమే జీవాత్మ లక్ష్యం అని కూడా ప్లేటిరియస్ అన్నాడు. భారతీయుల దర్శనాల ప్రభావం అతని మీద ఎంత ఉన్నది దీనిని బట్టి తెలుస్తుంది.

తత్వవేత్త అయిన పైథాగరస్ జీవాత్మ గతి అది చేసుకొన్న కర్మలను బట్టే ఉంటుందని చెప్పాడు. భారతీయులు సైతం మంచి కర్మలు చేస్తే మంచి ఫలితం; చెడు కర్మలు చేస్తే చెడు ఫలితంగా లభిస్తుందని చెప్పారు. ఇదే విషయం పైథాగరస్ గ్రీకు ప్రజలకు బోధించాడు. అతని సిద్ధాంతము ఇదే.

జీవాత్మ తాను చేసిన కర్మ ఫలితాన్ని బట్టే ఒక శరీరాన్ని విడిచి మరో శరీరంలో ప్రవేశిస్తుందని ఎంపిడోక్లోసు అనేవ్యక్తి అభిప్రాయ పడ్డాడు. గ్రీసులోని పూర్వ కాలపు సంప్రదాయానికి చెందిన ప్రజలకు జన్మ పునర్జన్మల మీద పరిపూర్ణ విశ్వాసం ఉండేది. భారతీయ ఆలోచనా ప్రభావం వారి మీద బాగా ఉన్నట్లు స్పష్టం. ప్రతి భారతీయుడు

"వాసాంసి జీర్ణాని యథావిహాయ నవాని గృహ్ణాతి నరోకపరాణి
తథాశరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ"

అనే ఈ సిద్ధాంతాన్ని ఒప్పుకొంటాడు. మనం చినిగి పోయిన బట్టలు విడిచి కొత్త బట్టలు ధరించినట్లే ఆత్మ శిథిలమైన శరీరాన్ని వదిలి కొత్త శరీరాన్ని ధరిస్తుంది.

## రోమ్:

ఐరోపాలోని అన్ని దేశాల మీద రోము నాగరికతాప్రభావం చాలా ఉంది.. కాని స్వయంగా దాని నాగరికత గ్రీకు నాగరికతనే పోలి ఉండేది. అందువల్ల రోమును గురించి సంగ్రహంగా తెలుసుకొంటే చాలు. ఇటలీలోని ప్రముఖమైన నది టైబర్‌కి దక్షిణాన సముద్రం ఒడ్డున ల్యాటియం అనే ప్రాంతం ఉంది. ఇక్కడి ల్యాటిన్ వంశానికి చెందిన ప్రజలే తరువాత రోము సామ్రాజ్య స్థాపకులైనారు. రోములోని యూట్రాస్కన్ ప్రజలు ఆరాధించే ప్రముఖ దేవత తినియా తన శస్త్ర తేజస్సును పెద్ద మేఘ గర్జన రూపంలో

ప్రకటిస్తుంది. ఈ వర్ణన పూర్తిగా మన ఇంద్రుని వర్ణనకు సరిపోతుంది.

ప్రాచీన కాలం నాటి శ్రేష్ఠత విషయంలో ఇప్పటి వరకు మనం భారతదేశానికి పశ్చిమాన ఉండే దేశాల గురించి తెలుసుకొన్నాం. భారతదేశానికి తూర్పున ఉన్న చైనా సాంస్కృతిక జీవనం క్రీ.పూ. 2000 సం. నుండి నిరంతరం కొనసాగుతూ వస్తున్నదని జూన్ బి. స్పార్క్ పండితుడు తాను తయారు చేసిన దేశపటంలో చూపించాడు. చైనా గురించి, ఇతర తూర్పు ద్వీపాల గురించి ఇప్పుడు మనం తెలుసుకొందాం.

## చైనా

భారతీయ పౌరాణిక గాథలలో చైనాలో తయారైన వస్తువుల గురించిన వర్ణన ఉంది. చీనాంబరం (చైనాలో తయారైన పట్టు వస్త్రం) భారతదేశంలో చాలా ప్రాచుర్యాన్ని పొందింది. చైనా సాహిత్యానికి చెందిన మిక్కిలి ప్రాచీన గ్రంథాలయం ప్రముఖ చైనా తత్వవేత్త కన్ఫ్యూషియస్‌ది. అది క్రీ. పూ. సుమారు 551 సం. నాటిదిగా భావిస్తున్నారు.

చైనా తత్వశాస్త్రం బారతదేశ తత్వ శాస్త్రం ద్వారా ఎంతో ప్రభావితమై ఉందో పరిశీలిద్దాం. ప్రాకృతిక శక్తులను, తమ పూర్వీకులను ప్రసన్నం చేసుకోవడానికి తాము చక్కగా కర్తవ్య పాలన చేయాలని, యజ్ఞ యాగాలు కర్మకాండలు, ఇతర సంస్కారాలు యధావిధిగా నిర్వహించాలని చైనా ప్రజల విశ్వాసం. నీతి శాస్త్ర విషయంలో మౌలిక సామ్యం ద్యోతకమవుతుంది. చైనీయుల విశ్వాత్మ, దైవిక శక్తులు, పితృలోక విశ్వాసాలు, ఇతర ప్రపంచంతో వాటికి గల సంబంధం, పరస్పర సహకారం, పితృ దేవతలకు, మానవులకు గల సంబంధం, యజ్ఞాలకు సంబంధించిన విశ్వాసాలు, సంప్రదాయక ఆచార వ్యవహారాలు, కుటుంబం, కులం, వంశం, వీటితో వ్యక్తికి గల సంబంధం, శ్రద్ధ, వినయం, సదాచారం, వీటిని గురించిన అభిప్రాయాలు మొ. అన్ని విషయాలు భారతీయ పద్ధతులను పోలి ఉన్నాయి.

చైనీయుల దృష్టిలో ముఖ్యంగా లావోత్సే దృష్టిలో లావో అన్నది ఈ ప్రపంచానికి మూల తత్వం. దాని నుండి ఈ సృష్టికి అవసరమైన యాంగ్, యిన్ అనే మరి రెండు తత్వాలు పుట్టాయి. ఆకాశం, పురుషత్వం, సక్రియత్వం ఈ మూడింటికి యాంగ్ ప్రతీకం. అంధకారం, నిష్క్రియత్వం జడత్వాలకు యిన్ ప్రతీకం. ఈ ఆలోచనకు మన సాంఖ్య యోగానికి చెందిన ప్రకృతి పురుష సిద్ధాంతానికి చాలా పోలిక ఉంది.

## బ్రహ్మదేశం నుండి అమెరికా వరకు

బ్రహ్మదేశం మొదలుకొని అమెరికా వరకు ఉన్న అన్ని దేశాల సంస్కృతుల మీద ప్రాచీన భారతీయ సంస్కృతి ప్రభావం చాలా ఉన్నది. ''ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ రెలిజియన్సు అండ్ ఎథిక్స్'' 7వ భాగం - 2వ అంతర్భాగంలో ప్రాచీన పోలనేషియన్ గాథలలో వైదిక భావాలు కనిపిస్తాయని కింగ్ అంటాడు. స్వర్గం - నరకం, భూమి-ఆకాశం, ఇహలోక పరలోకాలు వీటికి సంబంధించిన వారి అభిప్రాయాలు చూస్తే అక్కడ ఉన్న ద్వీపాలన్నింటిలో ప్రశాంతి మహాసాగర్ జలం నుండి వచ్చే వైదిక మంత్రాల ప్రతిధ్వని వినిపిస్తున్నదా అన్నట్లు ఉంటుంది. డా.రైండి తాను వ్రాసిన పోలేనేషియన్ రెలిజియన్స్ అనే పుస్తకంలో ఆ దేశాలకు సంబంధించిన అనేక కథలను అనువాదం చేసి వైదిక భావాలకు అవి ఎంత సన్నిహితంగా ఉన్నాయో తెలియజేశాడు. ఉత్తర దక్షిణ అమెరికాలలో హిందూ సంస్కృతి ప్రభావం ఎంత ఎక్కువగా ఉందో దినాన్ చమన్ లాల్ తన హిందూ అమెరికా అనే గ్రంథంలో వివరించాడు. కేవలం ఏవో కొద్ది వ్యాపార సంబంధాలు లేక ఒకరిద్దరు పండింతుల రాకపోకలతో ఇదంతా సాధ్యం కాదు.

క్రీ.శ. 10వ శతాబ్దంలో మధ్య అమెరికాలో ఇంకా, మాయు అనే నాగరికతలు వ్యాప్తిలో ఉండేవి. వాళ్ల మందిరాలు, దేవతలు చాలావరకు భారతీయ ప్రభావంలోనే ఉన్నట్లు ఈ నాటికీ మనం చూడవచ్చు. విస్తరణ

వాదులైన ఐరోపావాసులు అమెరికాలోని రెడ్ ఇండియన్లపై అనేక అత్యాచారాలు జరిపి చాలా మందిని చంపివేశారు. వాళ్ల భాషలో ఉండే సంస్కృత పదాలు అహ్మదాబాదుకు చెందిన సంస్కృత పండితుడు డా.కె.కె.శాస్త్రి గారికి 10 సం. క్రితమే దొరికాయి. 4 సం. క్రితమే స్వర్గవాసులైన పురాతత్వ శాస్త్రవేత్త డా.వాకణ్‌కర్ రెడ్ ఇండియన్లు చేసే పూజా పద్ధతిని స్వయంగా చూశాడు. పూజాసమయంలో నలుగురు మనుష్యులు యజ్ఞకుండానికి నాలుగు వైపులా కూర్చుండి అగ్నికి ఆహుతి నిచ్చేటప్పుడు మంత్రాలు చదువుతూ దువాదువా (స్వాహా, స్వాహా) అని అరుస్తూ ఉండేవారు. దీనిని బట్టి ఐరోపా వాసుల విస్తరణ వాదం ప్రారంభమై వాళ్ల వ్యక్తి నిష్ఠ భోగవాద ప్రాధాన్యం గల నాగరికత అమెరికా, ఆఫ్రికా, ఆస్ట్రేలియాలలో కొంత వరకు ఆసియా ఖండంలో తన ప్రభావాన్ని చూపకముందే శ్రేష్ఠమైన ప్రాచీన భారతీయ సంస్కృతి అమెరికా వంటి సుదూర దేశాల ప్రజల మీద తన ప్రభావాన్ని చూపుతూ ఉండేదని స్పష్టమవుతుంది.

## భారతదేశం స్వీకరించేదా? ప్రసాదించేదా?

ప్రపంచంలోని ఇతర దేశాల సంస్కృతులకు భారతదేశం సంస్కృతికి ఉండే పోలికలను చూసి చాలా మంది పండితులు భారతీయులే ఆయా దేశాల నుండి వైదిక భావాలను గ్రహించారని, భారతీయ సాంస్కృతిక సంపద ఇతరులనుండి గ్రహించిందే అని ఋజువు చేయడానికి ప్రయత్నించారు. కాని దీనికి ఎలాంటి ఆధారమూ లేదు. ఎందుకంటే భాషా శాస్త్రాన్ని వాస్తవ పరిస్థితుల్ని దృష్టిలో ఉంచుకొని చూస్తే ప్రపంచ వాఙ్మయంలో అన్నిటికంటే ప్రాచీన గ్రంథం వేదమే అని తెలుస్తుంది. భారతదేశంలో వేదాలు, ఉపనిషత్తులు, అరణ్యకాలు, బ్రాహ్మణాలు వ్రాయబడిన తర్వాత కూడా ఇతర ప్రపంచ దేశాలన్నిటిలో జ్ఞానప్రకాశం వ్యాప్తించలేదు. వేదానంతర ప్రాచీన సాహిత్యంలో మొదటి గ్రంథం ఝుండ్ అవెస్థ మీద భారతీయ ప్రభావమే ఎక్కువగా ఉంది. దానిలో ఉన్నదాని కంటే చాలా శ్రేష్ఠమైన ఆలోచనలే

భారతదేశంలో అంతకంటే చాలా పూర్వకాలంలోనే ఉన్నట్లు స్పష్టమవుతుంది. శ్రేష్ఠత్వం, మానసిక పరిపక్వత వల్లనే లభిస్తుంది. అపరిపక్వ స్థితిలో శ్రేష్ఠమైన ఆలోచనలు రావడానికి వీలుకాదు.

ఇక రెండవ విషయం. గ్రీకు మహాకవి హోమర్ వ్రాసిన ''ఇలియడ్'' అనే గ్రంథంలోనూ దాని ఉపసంహార రూపంలో వ్రాసిన ''ఒడెస్సీ'' అనే గ్రంథంలోనూ గల వర్ణనలను పరిశీలిస్తే భారతీయ ప్రభావం వాటి మీద చాలా ఉన్నట్లు స్పష్టమవుతుంది. క్రీ.పూ. 1450లో గ్రీకు నాగరికత ప్రారంభం కాకముందే భారతదేశంలో కురుక్షేత్ర యుద్ధం, రామరావణ యుద్ధం జరిగాయి ఈ విషయం త్రవ్వకాల ద్వారా ఇప్పుడు ఋజువైంది. కావ్యరంగంలో మహర్షి వాల్మీకి వ్రాసిన రామాయణ మహాకావ్యం మిక్కిలి ప్రాచీనమైనదనీ, ప్రపంచంలో అది మొదటి మహాకావ్యం అనీ, మహాకవి వాల్మీకి చరిత్ర నిజమే అనీ ఋజువైంది. అయితే మన భారతీయులు ఏమైనా ప్రత్యక్ష లేక పరోక్ష సాధనాల ద్వారా జ్ఞానం సంపాదించి ఈ గ్రంథాలు వ్రాశారా లేక ప్రపంచ ప్రతిభయే ఆయా కాలాలలో విభిన్న స్థానాలలో విధంగా ప్రకటితమైందా అనే విషయం పరిశోధించి తెలుసుకోవలసిన విషయం. కాని భారతీయులు తమ సంస్కృతిని ఇతరుల నుండి అరువుగా తెచ్చుకొన్నారనే విషయం మాత్రం కాల నిర్ణయాలను బట్టి పరిశీలిస్తే పూర్తిగా అసంబద్ధం అని ఋజువవుతుంది.

## జ్ఞానం స్వీకరిస్తే భారతీయులు కృతజ్ఞులే

భారతీయులు భూతకాలంలో ఎక్కడనుంచీ ఎప్పుడూ జ్ఞానం గ్రహించలేదని కాదు. తప్పక గ్రహించారు. అంతేకాదు. ఎవరినుంచి జ్ఞానం గ్రహించారో వారికి ఎప్పుడూ కృతజ్ఞులు గానే ఉన్నారు. క్రీ.పూ. 3000 సం. పూర్వం నుంచే భారతీయులు జ్యోతిశ్శాస్త్రంలో ఎంతో ప్రవీణులైనా 2వ శతాబ్దంలో యునాన్ దేశానికి చెందిన ఒక జ్యోతిష్కుని సిద్ధాంతం వారికి నచ్చి దానికి ''యవన జాతకం'' అని నామకరణంచేసి గ్రహించారు.

ఇంతే కాక వైద్య శాస్త్రంలో ప్రవీణులైన భారతీయ ఆయుర్వేదాచార్యులు ప్రపంచంలోని ఇతర దేశాల వైద్య పరిశోధకులను ఎంతో గౌరవంతో చూశారు. ఆయుర్వేదం మీద ఇతర వైద్య గ్రంథాలమీద చర్చాగోష్ఠులు జరుగుతూ ఉండేవి. భగవాన్ పునర్వసు ఆత్రేయ అధ్యక్షతలో జరిగిన అనేక చర్చాగోష్ఠుల ప్రస్తావన మనకు కనబడుతుంది. నాటిలో ఆయా దేశాలకు చెందిన భిషగ్వరుల పేర్లు వారిదేశాల పేర్లతో కలిపి పిలువ బడ్డాయి. ఉదా:- చైనా వైద్యుడు పింగలాక్షుడు, బాహ్లీక వైద్యుడు కాకాయనుడు. నాటి బాహ్లీక దేశం (బలఖ) నేడు ఆఫ్ఘనిస్థాన్ అయింది. కాకాయనుడు తయారు చేసిన మాత్రకు భారతీయులు కాకాయన మాత్ర అని పేరు పెట్టారు. ఈ నాటికీ దాని వైజ్ఞానిక ప్రయోగం జరిగేవేళ దానిని కాకాయన మాత్ర అనే పిలుస్తారు.

మొత్తంమీద తేలిన విషయం ఏమంటే భారతీయులు ఎవరినుండి దేనిని గ్రహించినా దానిని ఎంతో కృతజ్ఞతా భావంతో స్వీకరించారు. అందుచేత పేరులేని వస్తువులన్నీ భారతదేశానివే. ఈ భారతీయ విజ్ఞానం ప్రపంచదేశాలనన్నిటినీ పరిపుష్టం చేస్తున్నది. భారతదేశంలో అనేక పెద్ద విశ్వ విద్యాలయాలుండేవి. అవి గొప్ప జ్ఞాన ఖండాగారాలు. ప్రపంచ వ్యాప్తంగా పండితులంతా ఆ జ్ఞాన ఖండాగారాలను ఉపయోగించుకొంటూ ఉండేవారు.

# నేటి శ్రేష్ఠత్వం

## ప్రభావశాలి భారతదేశం

గత రెండు శతాబ్దాల నుండి ఐరోపా నాగరికత మొత్తం ప్రపంచాన్ని ప్రభావితం చేస్తోంది. దానికంటే ముందు ప్రపంచాన్ని విభిన్న దేశాల మీద భారతీయుల ప్రభావం ఎలా ఉండేదో మనం ఇప్పటి వరకు చూశాము. ఐరోపా నాగరికతా ప్రభావం గల నేటి అనగా రెండు శతాబ్దాల గురించి ఆలోచిద్దాం. ఇది చాలా అల్పకాలం. ప్రపంచం మొత్తంలో భారతీయ సంస్కృతి మిక్కిలి ప్రాచీనము శ్రేష్ఠము ఐనది అనడానికి మనం కనీసం 4

వేల సం.నాటి నిదర్శనాలు చూశాం. ఐరోపా నాగరికత ప్రభావ కాలం అందులో 20వ వంతు మాత్రమే ఐరోపా నాగరికత. మరి నాలుగు వేల సంవత్సరాలు నిలిచి ఉటేనే అది భారతీయ సంస్కృతికి సాటి రాగలుగుతుంది. అది ఇంకా ఎక్కువ కాలం నిలిచి ఉంటేనే సర్వ శ్రేష్ఠమైనది అని అనిపించుకోగలుగుతుంది. అప్పటివరకు ప్రభావ దృష్టితో చూస్తే భారతీయ సంస్కృతే సర్వ శ్రేష్ఠం అని చెప్పక తప్పదు.

## కుటుంబ వ్యవస్థ

వ్యక్తి నిష్ఠ భౌతికవాదం స్వీకరించిన కారణంగా గత 50, 60 సం. నుడి ఐరోపా కుటుంబాలు చిన్నాభిన్నం అయిపోతున్నాయి. అమెరికాలో విడాకుల ప్రమాణం 50 శాతానికిచేరింది. భారతీయ దంపతులు జీవిత పర్యంతం కలిసి మెలిసి ఉండటం చూసి అమెరికావారు ఆశ్చర్యంలో మునిగి పోతారు. వివాహం లేకుండానే కొంత కాలం కలిసి మెలిసి ఉండే స్త్రీ పురుషుల సంఖ్య అక్కడ బాగా పెరిగిపోతోంది. వాళ్లకు కలిగే సంతానంలో చాలా మందికి వారి తల్లిదండ్రులెవరో తెలియదు. పాఠశాలలలో చదివే బాలికలు కూడా పెళ్లికి ముందే తల్లులవుతున్నారు. కామవాంఛ పెరిగిపోతున్నది. అనాథ బాలురు, యువకులు విశృంఖలంగా దొంగతనాలు, దోపిడీలు, అత్యాచారాలు సాగించడంతో అనేక సాంఘిక సమస్యలు తలెత్తుతున్నాయి. వృద్ధులకు కుటుంబంలో ఆదరణ కరవై వృద్ధాశ్రమాల సంఖ్య దినదినం పెరిగిపోతున్నది. వారిలో చాలా మందికి మనశ్శాంతి లోపించిపోతున్నది. వృద్ధులు, వికలాంగులు, నిరుద్యోగులు, అనాథలు మొదలగు వారి రక్షణ, పోషణ భారం అక్కడ ప్రభుత్వాలే వహిస్తున్నాయి. అట్లాంటి వారి మీద పెట్టే ఖర్చు క్రమంగా పెరిగి పోతున్నదని, ఇది ఇట్లాగే సాగితే కొన్ని సంవత్సరాల తరువాత మొత్తం ప్రభుత్వ బడ్జెట్టు దాని మీదనే ఖర్చయి దేశం దివాలా తీస్తుందని ఒక ఆంగ్లేయ ఆర్థిక శాస్త్రవేత్త అన్నాడు.

పాశ్చాత్యుల కుటుంబాలలో సుఖశాంతులు నశిస్తున్నాయి. మానసిక వికారాలు, ఆత్మహత్యలు, అత్యాచారాలు, దుర్వ్యసనాలు, నిరాశ మొదలగు

బాధలకు కారణం పేదరికం, నిరుద్యోగం కాదని కుటుంబ వ్యవస్థ ఛిన్నాభిన్నం కావడమేనని మైకేల్ రాయిటర్ అనే ఇంగ్లాండుకు చెందిన బాల మానసిక శాస్త్రవేత్త ప్రకటించాడు. కుటుంబంలో ప్రేమ, ఆత్మీయతాపూర్ణ వాతావరణం లోపించడం వల్లనే నైతిక సామాజిక సమస్యలు తలెత్తుతున్నాయి. ''రాయల్ బ్యాంక్ ఆఫ్ కెనడా మంత్లీ లెటర్''లో అమెరికన్ రచయిత ఒకరు మన కుటుంబ వ్యవస్థను కాపాడుకొందాం అనే వ్యాసంలో కుటుంబం భూతల స్వర్గం అని వర్ణించాడు. ఒకప్పుడు రష్యా కుటుంబ జీవనాన్ని కూలగొట్టి ప్రజలందరూ సైనిక గుడారాలలో నివసిస్తూ దేశం కోసం పరిశ్రమించాలని ''కమ్యూన్ల'' ప్రయోగాన్ని చేపట్టింది. కాని అది అయోగ్యం, అసంభవం అని అనుభవం ద్వారా తెలుసుకొని రష్యా ప్రజలు మళ్లీ కుటుంబ వ్యవస్థనే స్వీకరిస్తున్నారు.

కొన్ని సంవత్సరాలకు ముందు ఇంగ్లాండు ప్రధానిగా ఉన్న మార్గరేట్ థాచర్ తన దేశంలో శిథిలమైపోతున్న కుటుంబ వ్యవస్థను చూసి చాలా విచారించింది. భారతీయ కుటుంబ వ్యవస్థ గురించి తెలుసుకోవాలని ఇంగ్లండులోని ఒక భారతీయ కుటుంబంతో కలిసి వారం రోజులు గడిపింది. అక్కడ శిశువులు మొదలుకొని వృద్ధుల వరకు అందరి మధ్య ఉన్న ప్రేమ ఆత్మీయ భావనలు చూసి ఆమె పరవశించిపోయింది. చాలామంది పాశ్చాత్య విద్వాంసులు, సామాజిక కార్యకర్తలు తమ కుటుంబాలను సంస్కారవంతం కావించడానికి ఇప్పుడెక్కువ ప్రాముఖ్యతనిస్తున్నారు. భారతీయ కుటుంబ వ్యవస్థ అత్యుత్తమమైనదని గ్రహించి వారా విషయం అధ్యయనం చేస్తున్నారు. ఇది ఇలా ఉండగా భారతదేశంలో కూడా చాలా మంది సంఘసేవకులు పాశ్చాత్య అనుకరణ ప్రభావంతో భారతీయ కుటుంబ వ్యవస్థ పతనోన్ముఖమై పోతున్నందుకు విచారిస్తున్నారు. ఈనాటి ఛిన్నాభిన్నమైన భారతీయ కుటుంబ వ్యవస్థ నుండి కూడా ఏదో కొంత మార్గదర్శనం పొందాలని పాశ్చాత్యులు భావిస్తున్నారని దీనివల్ల స్పష్టమవుతుంది.

ప్రాచీన భారతీయ విద్వాంసులు, సంఘ సేవకులు తమ సుదీర్ఘ సైద్ధాంతిక, ఆచరణాత్మక అధ్యయనం ఫలితంగా వ్యక్తి, సమాజం సుఖశాంతులతో జీవించాలంటే ప్రతి వ్యక్తి ఆలోచనలకు ఒక ప్రత్యేక జీవన దృక్పథం అవసరమని భావించారు. తన మేలు కంటే ఇతరుల శ్రేయస్సుకు ప్రాముఖ్యత ఈయాలనే భావన కలిగి దాని ప్రకారం ఆచరణ ఉన్నట్లయితే వ్యక్తికి సమాజానికి సుఖశాంతులు లభించి సృష్టి పర్యావరణ సంతులనం మొదలైనవి బాగుంటాయని వారు నిశ్చయించారు. ఇట్టి మానసిక స్థితి, ఆచరణ సంస్కారం ప్రతి వ్యక్తిలోనూ నిర్మాణం చేసే దృష్టితో వ్యక్తికి సమాజానికి మధ్య కుటుంబం ఉండటం చాలా ఉపయోగకరం. అని గ్రహించారు. తల్లి, తండ్రి, సంతానం వీరి మధ్య ఇట్టి ఆచరణ ఉండటానికి ప్రకృతి చాలావరకు తోడ్పడుతుంది. ఈ ఆచరణ పరిధిని ఇంకా పెంచుకొని అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు, అవ్వతాతలు, పిన్ని బాబాయిలు మొదలగు బంధువుల దాకా అంటే విశాల కుటుంబం వరకు విస్తరించడం సహజ సిద్ధమే. అనేక విధాలుగా వీరితో సంబంధం ఏర్పడుతూనే ఉంటుంది. విశాల సమాజంలో కుటుంబం మొదటి మెట్టు. కుటుంబంలో ఆత్మీయ భావంతో వ్యవహరించే మనస్తత్వం ఏర్పడినపుడు ఆ ఆత్మీయభావం కుటుంబం నుండి , గ్రామానికి, ప్రాంతానికి, దేశానికి తరువాత సంపూర్ణ మానవ సమాజానికీ తప్పక వ్యాపిస్తుందని వారు విశ్వసించారు.

సమాజం సక్రమ పద్ధతిలో నడవడానికి అవసరమైన గుణాలు కుటుంబంలో నిర్మాణం చేయడానికి భారతీయులు కృషి చేశారు. తరువాత పని దానంతట అదే సుసాధ్యమైంది. కుటుంబ మనస్తత్వాన్ని నిర్మాణం చేసే కార్యం అత్యంత ప్రాచీన కాలం నుండి మన దేశంలో కొనసాగుతూ ఉంది. వేదకాలం నుండి అంటే ఇప్పటికి ఐదారువేల సంవత్సరాలకు పూర్వం భారతీయ సమాజంలో ఇటువంటి అనేక కుటుంబాలుండేవి. ఇటువంటి కుటుంబాలు నిర్మాణం చేయుటంలో వారు విజయం సాధించినట్లే ఆ కుటుంబాలు ఇంత దీర్ఘ కాలం నిలిపి ఉంచడంలో కూడా వారు విజయం

సాధించారు. ఇట్టి కుటుంబ వ్యవస్థ ప్రయోజనాన్ని పాశ్చాత్యులతో పాటు వారిని అనుకరించే భారతీయేతరులు, భారతీయులు కూడా గ్రహించసాగారు. దీనిని బట్టి కుటుంబ వ్యవస్థ శ్రేష్ఠత్వం ఎలాంటిదో తెలుస్తుంది.

## సృష్టి మౌలిక అధ్యయనం

భారతీయ కుటుంబ వ్యవస్థ సుదీర్ఘ కాలం నుండి నడుస్తూ వచ్చింది. కాని ఈనాడది కొంత సడలింది. ఇట్టి శిథిలావస్థలో కూడా మొత్తం ప్రపంచాన్ని ప్రభావితం చేసిన పాశ్చాత్యులు ఈ వ్యవస్థనుండి మార్గదర్శనం లభిస్తుందని ఆశిస్తున్నారు. సకల సృష్టిని గురించి భారతీయ విద్వాంసులు చేసిన మౌలిక అధ్యయనం, తద్వారా తీసుకొన్న నిర్ణయాలు, వాటిని శ్రద్ధతో ఆచరణలో పెట్టడం ఈ కుటుంబ వ్యవస్థ ఇంత మహత్వ పూర్ణమైనది కావడానికి ముఖ్య కారణం. ఈ విషయంలో ఏ ఇతర సమాజం కూడా భారతీయ సమాజానికి సాటిరాదు.

చరాచర సృష్టిని పరమేశ్వర స్వరూపంగా పరమేశ్వరునిచే నిర్మించబడినదిగా భారతీయులు భావించారు. అందువలన సృష్టిలోని ఏవో కొన్నిటిని గురించి వేరువేరుగా ఆలోచిస్తే ప్రయోజనం శూన్యం. కొందరు సృష్టిలోని కేవలం ఒక భాగమైన వ్యక్తిని గురించి ఆలోచించారు. వారి ఆలోచన వ్యక్తినిష్ఠమైనది. మానవుడు తన వశం చేసుకోగలిగినంతవరకు సృష్టి సొంతం మానవ ఉపయోగానికి, ఉపభోగానికి మాత్రమే అని భావించిన కారణంగా వ్యక్తి, సమాజం సకల సృష్టి సర్వనాశనం వైపు సాగిపోతున్నాయి. ఈ విధంగా వేరువేరుగా ఆలోచించడానికి బదులు భారతీయులు సంపూర్ణ సృష్టిని ఒకే ప్రాణంగా, ఒకే రసంగా ఒక్కటిగా భావించి అధ్యయనం చేశారు.

సృష్టిలోని ఇతర ప్రాణులన్నిటికంటే మానవుడు సహజ సిద్ధంగా కొన్ని ప్రత్యేక గుణాలు కలిగి ఉన్నాడు. మానవుడు తనకున్న బుద్ధి విశేషం కారణంగా అతడు మంచి-చెడు, సార-అసార మొదలైన వాటిని గురించి చక్కగా ఆలోచించగలడు.

అంతేకాక ఇతర మానవులతో కూడా దీనిని గురించి చర్చించగలుగుతాడు. ఈవిధంగా సామూహిక ఆలోచన ద్వారా అతడొక నిర్ణయానికి వచ్చి సంఘటిత రూపంలో దానిని ఆచరణలో పెట్టగలడు. ఇట్టి విశిష్ట గుణాలున్న కారణంగా మానవుడు తాను సంకల్పిస్తే సంపూర్ణ సృష్టిని సర్వనాశనం చేయగలడు. లేదా చక్కగా నడిచే వ్యవస్థ చేయగలడు. అతడేమి చేస్తాడన్న విషయం అతని మనస్సు మీద ఆధారపడి ఉంది. మానవుని ఈ విశేష గుణాల కారణంగా భారతీయులు తమ సృష్టి అధ్యయన కేంద్రాలను నాలుగు భాగాలుగా విభజించారు. అవి పరమేశ్వరుడు, సృష్టి, మానవ సమాజం, వ్యక్తి. అంటే సంపూర్ణ సృష్టి అధ్యయనంలో సగం ప్రాముఖ్యత మానవుడికే ఇచ్చారు. మానవుని మనస్సును సంస్కరించే కార్యం వారి దృష్టిలో అంత ముఖ్యమైనది. పరమేశ్వరుడు సృష్టి మొదలగు విషయాలను గురించి భారతీయులు చాలా లోతుగా అధ్యయనం చేశారు. వారి వేదాంత గ్రంథాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. మన ప్రస్తుత విషయాన్ని దృష్టిలో ఉంచుకొని చూస్తే వారి సృష్టి నిర్మాణ సిద్ధాంతం చాలా మహత్వపూర్ణమైంది.

పరమేశ్వరుడే సృష్టిలోని ప్రతి అణువులోనూ ఉన్నాడు. అంటే ఆయన అంశ ఉన్నది. ఈ పరిజ్ఞానం, సంస్కారం ప్రతి వ్యక్తికి అవసరమని భారతీయులు భావించారు. వ్యక్తిలో పరమేశ్వర అంశ ఉంది. జీవాత్మ ఉంది. అట్లే ఆ అంశ సృష్టిలోని ప్రతి భాగంలోనూ ఉంది. అట్లే ఆ అంశ సృష్టిలోని ప్రతి బాగంలోనూ ఉంది. ఇద్దరు వ్యక్తులలోనూ ఉంది. అందుకే ఇద్దరూ ఆత్మీయులైపోతారు. మనుష్యునకు బుద్ధి, ఆత్మ విశేషంగా ఉన్న కారణంగా సంపూర్ణ సృష్టితో ఆత్మీయంగా వ్యవహరించవలసిన బాధ్యత అతనిపై ఎక్కువగా ఉంది. ఇట్టి సంస్కారం ప్రతి మానవుడు పొందినట్లైతే ఈ సృష్టి సక్రమ పద్ధతిలో నడుస్తుంది. ఈ విషయాన్ని మానవుడు కేవలం సైద్ధాంతిక దృష్టితో అర్థం చేసుకొన్నంత మాత్రాన చాలదు, ఆవిధంగా ఆచరించాలి. ఇట్టే ఆచరణను రూపొందించడానికే ప్రతి మానవుడు తన

మేలుకంటే ఇతరుల శ్రేయస్సుకు ఎక్కువ ప్రాముఖ్యతనీయాలనే సంస్కారం అవసరం. ఇది భారతీయుల రెండవ సంస్కారం. ఈ ముఖ్య సంస్కారం,ఇతర సంస్కారాలు ప్రతి వ్యక్తిలో నిర్మాణం చేసే ఉద్దేశంతో భారతీయులు సాంస్కృతిక ప్రచారకులను ఏర్పాటు చేశారు. ఇట్టి ప్రచారకులను సూతులంటారు. ధర్మం, వేదాంతం, నీతిశాస్త్రం, సమాజ శాస్త్రం మొదలగు విషయాలలో సూతులు నిష్ణాతులై ఉండేవారు. సమాజంలోని ప్రజల వివిధ స్థాయిలు, అవగాహన, తెలివితేటలు గ్రహించి వారికి బోధించడానికి తగిన శిక్షణను పొంది ఎంతో సులభంగా ప్రభావవంతంగా ధర్మబోధచేస్తూ ప్రజలను సంస్కరిస్తూ ఉండేవారు, వ్యక్తి సంస్కారకార్యం కొరకు కావలసినంత మంది సూతుల ఏర్పాటు వేల సంవత్సరాలనుండి మనదేశంలో నిరంతరం కొనసాగుతూ వస్తున్నది. ఈ సంస్కారాలకు వ్యావహారిక రూపం ఇచ్చే దృష్టితో దాని శిక్షణ వ్యవస్థ ప్రతి కుటుంబంలోనూ చేయబడింది. ఈవిధమైన సాధనాలతో భారతీయులు సైద్ధాంతిక వ్యావహారిక శిక్షణ నివ్వటం ద్వారా తమ సమాజాన్ని ఎంతో వైభవోపేతంగా సుఖశాంతి సంపన్నంగా సుదీర్ఘజీవిగా తీర్చి దిద్దారు.

## పాలకులు కాదు ఆదర్శం

ఈ చరాచర సృష్టి సక్రమ పద్ధతిలో నడవడానికి చక్కటి సంస్కారం పొందిన మానవుడే సర్వోత్తమ సాధనమనే విషయం నిర్ధారణ అయింది. దాని ప్రకారమే భారతీయుల సమాజ వ్యవస్థ కార్యకలాపాలు నిశ్చయమయ్యాయి. పాశ్చాత్యుల ప్రభావం కారణంగా ప్రభుత్వం, జాతి ఈ రెండూ ఒకే గాడిన కట్టబడ్డాయి. అంతేకాక అనేక దేశాల సమాజ వ్యవస్థలలో ప్రభుత్వమే సర్వాధికారియైంది. పాశ్చాత్యుల సామాజిక వ్యవస్థ కారణంగా గత వంద సంవత్సరాల్లో ఎక్కడో హిట్లరు తయారు కాగా మరెక్కడో స్టాలిన్. ఇప్పుడున్నదంతా ప్రజాస్వామ్య పటాటోపమే. ఈ ప్రజాస్వామ్య రాజ్యాలలో ఏ రాజకీయ పక్షం అధికారంలోనికి రావాలి అనేది అక్కడి ధనవంతులు నిర్ణయిస్తారు. ఆ ధనవంతులు నిస్వార్థులైన దేశభక్తులు

కాదు. వారికి ఆదేశ శ్రేయస్సు గురించి కల్పన లేదు. ఇప్పుడైతే బహుళ జాతి కంపెనీలు నిర్మాణమై వివిధ దేశాల ధనవంతులు ఏకమై తమతమ ఆర్థిక సామ్రాజ్యాలను నిర్మించుకోవాలని చూస్తున్నారు. అదిన్నీ ఏదేశంలో ఏ రాజకీయ పక్షం అధికారంలోకి వస్తే తమకు లాభిస్తుందో అని లెక్కవేస్తున్నారు. మానవ సమాజ శ్రేయస్సు కోసమే ఇదంతా జరుగుతున్నదని ఎవ్వరూ ధైర్యంగా చెప్పలేరు. భారతదేశంలో 50 సంవత్సరాల నుండి నడుస్తున్న ప్రజాస్వామ్య పరిస్థితి ఎలా ఉందో అందరికీ తెలుసు. ప్రభుత్వం రోజురోజుకూ అన్ని సామాజిక రంగాలలోను అధికారాన్ని తన గుప్పిట్లో ఉంచుకొంటున్నది. చట్టాల సంఖ్య వాటి పద్ధతులు ఎక్కువవుతున్నాయి. దాంతో చట్టంలోని లొసుగుల ఆధారంగా తమ స్వార్థ ప్రయోజనాలను సాధించుకొనే వారి సంఖ్య కూడా పెరిగిపోతోంది.

భారతీయులు తమ సుదీర్ఘ చరిత్రలో ప్రభుత్వానికి ఇంత నిరంకుశాధికారం ఎప్పుడూ ఈయలేదు. ప్రతి వ్యక్తినీ ప్రత్యేక సంస్కారాలతో తీర్చిదిద్దటమే వారి ముఖ్యలక్ష్యం. కేవలం ప్రభుత్వ చట్టాలతో సంస్కారం నిర్మాణం కాదనే విషయం గత 50 సంవత్సరాల్లో చాలామంది భారతీయులు స్వయంగా గ్రహించారు. సంస్కారం పొందిన వ్యక్తుల నడవడి ద్వారానే సంస్కార నిర్మాణం సాధ్యమవుతుంది. అందువల్లనే సమర్థులైన సంస్కారవంతులైన వ్యక్తులకు సమాజంలో గౌరవప్రదమైన స్థానం లభించేట్లుగాను వారినే సమాజం ఆదర్శంగా గ్రహించేట్లుగాను భారతీయ సమాజ వ్యవస్థ నిర్మించబడింది.

స్వర్గీయ మానవేంద్ర రాయ్ భార్య ఎల్లెన్ రాయ్ In Man's Own Image అనే తన గ్రంథంలో ప్రపంచంలో విభిన్న మానవ సమాజాలను అధ్యయనం చేసి సుదీర్ఘ సుఖ జీవనం కొనసాగిస్తున్న సమాజాన్ని వర్ణించింది. తాము నేర్చుకొన్న విషయాలలో మిక్కిలి ప్రాముఖ్యం కలిగి సంపూర్ణ సమాజ శ్రేయస్సే జీవిత లక్ష్యంగా భావిస్తూ తాము నివసించే సమాజం సంఖ్యకు తగినంత ఉండి ప్రజల చేత, రాజుచేత గౌరవాదరాలు పొందుతుండే

వ్యక్తులున్న సమాజం సుఖ సంతృప్తులు కలిగి దీర్ఘజీవియై మనుగడ సాగిస్తూ ఉంటుందని ఆమె పేర్కొన్నది. ఎల్లైస్ రాయ్ వర్ణించినట్లు భారతీయ సమాజ నిర్మాణం జరిగింది. బహుశ ఈ సమాజం గురించే ఆమె వర్ణించిందేమో!

ఇటువంటి విద్వాంసులు నిస్వార్థపరులు, సమాజ శ్రేయోభిలాషులూ ఐన వ్యక్తులనే భారతీయులు ఋషులు, మునులు అని పిలిచారు. జనాభాకు తగినట్లుగా ఇటువంటి జట్లు గ్రామ పంచాయతీ మొదలు జాతి పంచాయతీ వరకు ఉండేవి. ప్రతి గ్రామం స్వయంసమృద్ధం అయి ఉండేది. గ్రామ ప్రజల అవసరాలు ఆ గ్రామంలోనే తీరే శ్రద్ధ వహించే వారు. గ్రామంలోని ప్రతి ఒక్కడు గ్రామ అవసరాల గురించి ప్రత్యేక శ్రద్ధ వహించే వాడు. గ్రామ పంచాయతీ ప్రతి గ్రామస్థుని గురించి ఆలోచిస్తూ ఉండేది. త్యాగులు, శీలవంతులు, బుద్ధివంతులు అయిన వ్యక్తులే గ్రామ పంచాయతీలకు ఎన్నుకోబడేవారు. గ్రామ పంచాయతీ వలెనే విద్య, వ్యాపారం, వివిధ వృత్తులు, వివిధ కులాలు, వివిధ సంప్రదాయాలు మందిరాలు మొదలైనవన్నీ వ్యవహారాలన్నీ స్వేచ్ఛగా స్వయం పూర్ణంగా నిర్వహింపబడేవి. గ్రామ పంచాయతీల కార్యకలాపాలలో ప్రత్యక్షంగా ప్రభుత్వాధికారులు జోక్యం కలిగించుకొనేవారు కాదు. ప్రభుత్వ మార్గదర్శనం కావాలని గాని ప్రభుత్వం నుండి ప్రయోజనాలు పొందాలని గాని గ్రామ పంచాయతీలు ఆశపడటం అరుదు. సామాజిక జీవనానికి సంబంధించిన అనేక రంగాలు ఇలాంటి స్వతంత్ర స్వయం సమృద్ధి వ్యవస్థలు కలిగి ఉన్నందువల్ల ప్రభుత్వాలు మారినా సామాజిక జీవనానికి ఎలాంటి హాని సంభవించేది కాదు. ఆయా రంగాలలో పనులు సరియైన పద్ధతిలో నడుస్తూ అనేక మందికి ఉత్తమ సంస్కారం ఇచ్చే కార్యం కూడా నిరంతరం చక్కని పద్ధతిలో కొనసాగుతూ ఉండేది. అందరిముందూ కొన్ని ఆదర్శాలుండేవి. చిన్నా పెద్దా రంగాలలో నిస్వార్థ భావంతో పనిచేసే సమర్థులైన కార్యకర్తలే వారికి ఆదర్శం. ప్రభుత్వం ప్రభుత్వ యంత్రాంగంలో పనిచేసే వారంతా సంస్కారవంతులే. అందువల్ల సుదీర్ఘ

కాలం భారత రాజకీయ చరిత్రలో అత్యాచారులు, భ్రష్టాచారులు ఐన రాజుల సంఖ్య నామమాత్రంగానే ఉండేది. సంస్కారవంతులైన వ్యక్తుల ఆదర్శం సర్వదా ముందుంచుకొని అందరితో ఆత్మీయమైన వ్యవహారం, త్యాగభావన గల భారతీయ సమాజ జీవనం అనేక వేల సంవత్సరాలనుండి కొనసాగుతూ వస్తున్నది. పాశ్చాత్య జీవన విధానాన్ని అనుసరించి సమాజ జీవనానికి సంబంధించిన అన్ని అధికారాలు ప్రభుత్వానికి కట్టబెట్టినందువలన కలిగిన అనుభవం తృప్తికరంగా లేదు.

ఒక పాశ్చాత్య తత్వవేత్త ఉదారుడైన రాజు ఎలా ఉంటాడో ఊహించి గ్రంథ రచన చేశాడు. అటువంటి రాజు ఏలే రాజ్యంలోనే సామాజిక జీవనం సుఖ సంపన్నంగా ఉంటుందని ఆ తత్వవేత్త పేర్కొన్నాడు. అలాంటి ఉదార హృదయులైన శాసకుల సంఖ్య పాశ్చాత్యుల నాలుగైదు వందల సంవత్సరాల కాలఖండంలో చాలా తక్కువే. అదే భారతీయుల సుదీర్ఘ సమాజ జీవనంలో 20వ శతాబ్దానికి చెందిన మైసూరు, బరోడా రాజుల వరకు ఉదారచరితులైన రాజుల పరంపర నిరంతరం కొనసాగుతూ వచ్చింది. దీనిని బట్టి భారతీయ సమాజ జీవనం యొక్క శ్రేష్ఠత్వం నిరూపితం అవుతుంది.

ఈవిధంగా ప్రపంచ ప్రజల మీద తన సంస్కృతి ప్రభావం చూపిన కాలఖండం గురించి, కుటుంబ వ్యవస్థ గల సమాజ జీవనానికి గల ప్రాముఖ్యం గురించి అలాగే ప్రాధాన్యత ఉండవలసింది ప్రభుత్వానికా లేక త్యాగులు, సమర్థులు విద్యావంతులు అయిన మహాపురుషులకా అనే మూడు అంశాలను మనం చర్చించాము.

ఈ విషయాలలోనూ సమాజ జీవనానికి సంబంధించిన ఇంకా ఎన్నో విషయాలలోను భారతదేశం ఎంతో శ్రేష్ఠమైంది. అందులో ఒక అంశం సంపూర్ణ మానవ సమాజాన్ని సంస్కరించాలనే కోరిక. అక్రమణ రాహిత్యం ఆలోచనా స్వాతంత్ర్యం, అతిథి మర్యాద, భిన్నత్వంలో ఏకత్వం, ప్రభుత్వం మీద ధర్మ నియంత్రణ స్త్రీల పట్ల గౌరవ భావం, ఆధ్యాత్మిక మనస్తత్వం

మొదలగు విషయాలలో కూడా ఈనాటి భారత దేశ శ్రేష్ఠత్వం బుజువవుతుంది. కాని పుటల సంఖ్య పరిమితమైన కారణంగా పైన పేర్కొనబడిన మూడు విషయాలతోనే మనం సంతృప్తి చెందాలి. ప్రతి భారతీయునికి ప్రత్యేక సంస్కారాలనిచ్చే ప్రయత్న ఫలితంగానే ఈ విశిష్ట గుణాలు సమాజంలో నిర్మాణమైనాయి. సామాజిక, వైయక్తిక గుణాలు రెంటిలో ఈనాటి భారతీయుడు తన శ్రేష్ఠత్వాన్ని నిరూపించుకొన్నాడు. దానికిన్నీ పుటలపరిమితి ఉంది కాబట్టి కేవలం రెండుమూడు ఉదాహరణలనిస్తున్నాం.

24 మే 1987 వాషింగ్టన్ వార్తా పత్రికలో ఒక వార్త ఇలా ఉంది ''సంయుక్త అమెరికా అధ్యక్షుడు రేనాల్డురీగన్ మొత్తం అమెరికా నుండి ఎంపిక చేసిన ఆరుగురిలో ఉత్తమ విజ్ఞాన శాస్త్ర విద్యార్థులలో భారతదేశానికి చెందిన ''కేశానీ భూషణ్''అనే పేరు గల 15 సం. హిందూ విద్యార్థిని ఉన్నది'' ఈనాటికీ ఇంగ్లండ్ గాని,జపాన్ గాని, అమెరికా గాని ఏదేశమైనా సరే భారతీయ విద్వాంసుల బుద్ధి విశేషాన్ని కొనియాడకుండా ఉండలేదు.

ఏపని చేపట్టినా దానికి తగిన కఠిన పరిశ్రమ చేయాలనే భారతీయుల మనస్తత్వ ప్రభావం కూడా విదేశీయులమీద చాలా ఉంది. అమెరికా నుండి భారతీయులను వెడలగొట్టాలనే ఆందోళన సాగిన వేళ ఒక అమెరికా వాస్తవ్యుడిలా అన్నాడు. ''ఈనాడు నిరుద్యోగ భృతి పొందుతున్న అమెరికన్ యువకులు భారతీయుల వలె ఎడతెరపి లేకుండా కృషి చేయగలరా? ఈరోజున ఒక భారతీయ డాక్టర్ అమెరికా వచ్చినట్లయితే రెండు మూడు సం. తర్వాత అతడు తన సహాయం కోసం తన సోదరులను గాని భందువులను గాని పిలిపించుకొంటాడు. కొద్ది సంవత్సరాలలోనే అతని మొత్తం కుటుంబం అమెరికా వచ్చి స్థిరపడుతుంది. ఈలాగున మన డాక్టర్లు ఇంత పరిశ్రమించడానికి సిద్ధంగా ఉన్నారా? ఒకవేళ భారతీయులు అమెరికా వదలి వెళ్లిపోతే వాళ్లు చేస్తున్న పనంతా ఎవరు చేస్తారు?''

వర్తమాన కాలాన్ని ప్రజలు కంప్యూటరు యుగం అంటున్నారు. డిసెంబరు 1996 మొదటి వారంలో లండన్‌లో ''సాఫ్ట్‌వేర్ - 1996'' ప్రదర్శన జరిగింది. అదులో భారతీయ సాఫ్ట్‌వేర్‌కే అగ్రతాంబూలం. దానికి ప్రపంచ దేశాలన్నిటికంటె గిరాకీ.

కొన్ని సంవత్సరాల క్రితం మన వాయుయాన విభాగానికి ఒక సూపర్ కంప్యూటర్ కావలసి వచ్చింది. దానిని పంపమని అమెరికా కంపెని ''క్రే కంప్యూటర్స్'' వారిని అడిగాం. ఆ కంపెనీ నిబంధనలు నచ్చక పోవడంతో పూనాకు చెందిన ''సెంటర్ ఫర్ డెవలప్‌మెంట్ ఆఫ్ అడ్వాన్స్‌డ్ కంప్యూటింగ్'' అనే కంపెనీ ఈ పనికి ముందుకు వచ్చింది. చాలా కొద్ది సమయంలో దానిని తయారు చేసి ''పరమ'' అని నామకరణం చేసి వాయుయాన విభాగానికి అందించింది. వెల విషయంలో అమెరికా చెప్పిన 10 లక్షల డాలర్లకు బదులు 1 1/2 లక్షల డాలర్లకే తయారు చేసింది. ఇప్పుడు విదేశాలలో ''పరమ''కు పరమ గిరాకీ.

దీని ఆధారంగా ముంబాయికి చెందిన భాభా అణు విజ్ఞాన కేంద్రం ''అనురాగ్, అనుపమ'' అనే పేర్లు గల రెండు సూపర్ కంప్యూటర్లను తయారు చేసింది. ఇంత వరకు అమెరికా సూపర్ కంప్యూటర్లకే గిరాకీ. దానిని ఈనాడు భారతదేశం సవాల్ చేస్తున్నది. భారతీయ రక్షణ విభాగానికి చెందిన విమానాల ఇంజన్‌ల మంచి చెడులను చూడటానికి ''అనుపమ'' ఉపయోగపడుతున్నది. భాభా అణు పరిశోధన కేంద్రం ''అనుపమ'' ద్వారా తెలుసుకొన్న విషయాలను ఇంటర్‌నెట్‌తో జోడించింది. ఇప్పుడు పరమకంటె ఎక్కువ ప్రభావం కల ''పరమ-రే'' అనే సూపర్ కంప్యూటర్‌ను తయారు చేయటానికి భారతీయ శాస్త్రజ్ఞులు కృషి చేస్తున్నారు. అందులో వారు సఫలీకృతులైతే భారత్ అమెరికాను తలదన్నుతుంది.



## సేవికా ప్రకాశన ఆంధ్రప్రాంత ద్వారా ప్రచురితమైన పుస్తకములు

| | | |
|---|---|---|
| 1. | రాష్ట్ర సేవికా సమితి (సంక్షిప్త పరిచయం) | రూ. 6.00 |
| 2. | మనదేశపు ఎల్లలు - నిన్న, నేడు, రేపు | రూ. 3.00 |
| 3. | మాతృత్వము | రూ. 3.00 |
| 4. | కర్తృత్వము-నేతృత్వము | రూ. 3.00 |
| 5. | రాష్ట్రనాథ్ | రూ. 2.00 |
| 6. | శ్లోకస్తోత్ర రత్నావళి | రూ. 3.50 |
| 7. | ఆచార పద్ధతి | రూ. 1.00 |
| 8. | స్త్రీ జీవన సఫలత | రూ. 1.00 |
| 9. | వందనీయ మౌసీజీ | రూ. 10.00 |
| 10. | శక్తి-కేంద్రము | రూ. 5.00 |
| 11. | భగవాధ్వజము | రూ. 5.00 |
| 12. | సోదరి నివేదిత | రూ. 2.00 |
| 13. | ప్రాతఃస్మరణీయ మహిళలు | రూ. 3.00 |
| 14. | దేశ సమస్యలు | రూ. 1.50 |
| 15. | వందేమాతరం గాథ | రూ. 5.00 |
| 16. | కర్మయోగిని సరస్వతీ బాయి ఆప్టే | రూ. 8.00 |
| 17. | కర్మయోగిని అహల్యాబాయి | రూ. 7.00 |
| 18. | కుటుంబ వ్యవస్థ అవసరమా? | రూ. 10.00 |
| 19. | चिरंतन भारतीय संस्कृति के आधार | रू. 7.00 |